# LIFE

OF

# Rajarshi
# Raja Ram Mohon Roy.



BY

**Akurathy Chalamayya.**

శాంతికుటీరగ్రంథమాల—ప్రథమపుష్పము.

# రాజర్షి
# రాజా రామమోహనరాయల
# చరిత్రము.

వంగభాషామాతృక ననుసరించి

ఆకురాతి చలమయ్యచే

ఆంధ్రమున వ్రాయఁబడినది.

ద్వితీయముద్రణము 1000 ప్రతులు.



పిఠాపురము

శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాల.

1935

వెల రు 0—10—0.

# అంకితము.



పరమపూజ్యులయిన

పితృదేవునకు

శ్రద్ధాభక్తులతో

సమర్పింపఁబడినది.

# విషయసూచిక.



# విజ్ఞప్తి.

---

కం. "మన గుణముల దిద్దుకొనం
గను నద్దముఁ బోలియుండు ♦ ఘనులచరిత్రల్
కని విని యా చరితమ్ముల
ననుసరణముసేయువాని ♦ కగుఁ దత్సుఖముల్."

" Lives of great men all remind us
We can make our lives sublime "

అని నుడివినటుల, మనజీవితములను దిద్దుకొనుటకు మహాపురుషుల జీవితచరిత్రలు చదువుట యత్యంతావశ్యకము. అందులోను ముఖ్యముగా దేశకల్యాణార్థమై తమజీవితములను ధారవోసి బహుకష్టములపాలై ధన్యులై తరించినవారి జీవితచరిత్రలు పవిత్రతమములును, ఆకర్షకములును, జ్ఞానోద్బోధకములును, ఉత్సాహజనకములును నవజీవనోద్దీపకములునైయుండును. ఇట్టిమహానుభావులచరిత్రలు చిన్ననాఁటనుండియుఁ జదువుచుండినచోఁ బిల్లలజీవితము లుత్తమముగా నొప్పఁజేయుటకు నాదర్శకములుగా నుండునని యెంచి ప్రథమమున శ్రీరాజర్షి రాజా రామమోహనరాయలవారి శతవార్షికోత్సవ సందర్భమున నామహామహుని పవిత్రజీవితచరిత్ర నొకచిన్నగ్రంథముగా

వ్రాసి యిది పిల్లలహస్తములలో నుపహారముగ నుంచుట కుప యుక్తమగునని యభ్యొచ్ఛించితిని. దీనిని బిల్లలును బెద్దలును బఠించి యించుకైనఁ బ్రయోజన మొందఁగలిగినచో నాచేసిన కృషిసార్థకమగు నని విజ్ఞప్తి.

ఈపుస్తకముద్రణమున కైన వ్యయమంతయు మహారాజశ్రీ కోకా వేంకటసుబ్బారావునాయుడుగారు ఒకస్నేహితునిద్వారా మాయాశ్రమబాలురకు బహుమానముగా నిప్పించినందులకు వారికి మాకృతజ్ఞతాపూర్వకవందనములు.

దీనివెనుక మహర్షి దేవేంద్రనాథ ఠాకూరుగారి చరిత్రము ప్రచురింపఁబడినది. బ్రహ్మానంద కేశవచంద్రసేను, పండిత శివ నాథశాస్త్రి మొదలగువారియొక్కయు మఱి యితరులయొక్కయు జీవితచరిత్రములు క్రమముగాఁ బ్రచురింపఁబడును.

ఇట్లు

ఆకురాతి చలమయ్య,

వ్యవస్థాపకుఁడు.

# కృతజ్ఞత



ఈపుస్తకము నత్యంతదయతో నామూలాగ్రముగాఁ బరిశోధించి యతిశీఘ్రముగా నచ్చొత్తించి మాకందఁజేయించిన శ్రీపీఠికాపురాస్థానపండితులు కవీశ్వరులునయిన బ్రహ్మశ్రీ ఓలేటి వేంకట రామశాస్త్రిగారికి నాకృతజ్ఞతాపూర్వకవందనము లర్పించుచున్నాను.

ఇట్లు

గ్రంథకర్త.

To

Ram Mohon

The world was his country

and

India his mother.

ఓమ్.

# రాజర్షి
# రాజా రామమోహనరాయలు.

## ప్రథమ ప్రకరణము.

వృక్షమునం దెట్టిఫలములు ఫలించునో అంకురమును జూచి గ్రహించుటకు వీలులేనటుల వైష్ణవచూడామణియు, శాంతస్వభావుఁడు నయినకృష్ణచంద్రబంధోపాధ్యాయుని వంశమందు భవిష్యత్తునం దొకవిద్యోత్సాహియు ధర్మసంస్కారియు జన్మించి యాకాలపు హిందూసమాజమునందున్న మూఢాచారములయొక్కయు, సంకుచితాభిప్రాయములయొక్కయు, సరిహద్దులను దుడిచివేసి స్వదేశమునుండి విదేశమువఱకు నూఁకి వేయునని యెవరైన నెప్పుడైన స్వప్నమందైనను దలంచియుండిరా ? కాని భగవానునియిచ్ఛ నెవరు గ్రహింపఁగలరు ?

కృష్ణచంద్రుని పూర్వపురుషులు వంగీయులుగారు. వారి నివాసము పశ్చిమమున "కనౌజ" ప్రదేశమందు. వారచ్చటి నుండి ప్రథమమునఁ దూర్పువంగదేశమునకును, అనంతర ముద్యోగసందర్భమున ముర్షిదాబాదునకును, అచ్చటినుండి క్రమముగా

హుగ్లీ జిల్లాకును వచ్చి నివాసమేర్పఱచుకొనిరి. వంగదేశము నీరు, గాలి భూమియొక్క గుణముచేత రెండుమూడుతరములకే ఆపశ్చిమదేశవాసులు క్రమముగ బెంగాలీవారై హుగ్లీమండలాంతర్గంత ఖానాకుల కృష్ణనగరమునొద్ద 'రాధానగర'మను చోట గృహములను నిర్మించుకొనిరి. క్రమముగా వారికిఁ దమ దేశముతో సంబంధము వీడిపోయెను. అందఱును సంపూర్ణముగా బెంగాలీవారైరి. తుదకు రాధానగరమే వారికిఁ బైతృకావాసస్థానముగాఁ బరిణమించెను.

అపు డీదేశపురాజులు మహమ్మదీయులు. నవాబుసర్కారునందు హిందువులనేకు లుద్యోగములఁ జేయుచుండెడువారు. తమతమకార్యకౌశలమును జూపి గొప్ప గొప్ప పదవులను బొందెడివారు. రాజపురుషులుకూడ వారి గుణగణములకు మెచ్చి వారల కనేకవిధము లగుబహుమానముల నిచ్చి రాజగౌరవ బిరుదములతో భూషితులను జేయువారు. బహుమానములతోఁ బాటు ధనమును, శక్తిని గడించి దేశమునందు గౌరవనీయులు, మాననీయులునై యుండెడివారు. అపు డిట్లనేకులు 'చౌధరి' 'రాయ్' 'ఖాన్' పేర్లను బొంది గొప్పవారైరి. యిప్పటివఱకును వారల వంశము లాగౌరవసూచకనామములతోఁ బ్రఖ్యాతము లై యున్నవి.

కృష్ణచంద్ర బంధోపాధ్యాయుఁడను నవాబు సర్కారునం దుద్యోగముఁజేసి 'రాయ్' యను బిరుదమునుబడసి మిక్కిలి

గొప్పవాఁ డాయెను. అప్పటినుండి వారి వంశమందు బంధోపాధ్యాయ' బిరుదము లోపించి 'రాయ్' బిరుదమే ప్రచలిత మాయెను. అప్పటినుండి యీవంశమువారు రాయవంశజులుగాఁ బ్రఖ్యాతులైరి ?

కృష్ణచంద్రుఁడు శైశవమునుండియు సాధువును మిక్కిలి నిష్ఠావంతుఁడు నయిన విష్ణుభక్త బ్రాహ్మణుఁడు. ఆయన వాసస్థలము ముర్షిదాబాదు. విష్ణుభక్తుఁడేగాక విద్యయందు గొప్ప పండితుఁడు. స్వభావమునందుఁ బరమధార్మికుఁడును, న్యాయవంతుఁడును, సత్యనిష్ఠఁగల సాధుపురుషుఁడు నైయుండెను. కావున భగవానుఁ డాయన సుగుణముల కామహోన్నతస్థితి నొక బహుమానముగా నొసఁగెను.

ఆకులనడుమ నున్నపుష్ప మెంత దాఁగియున్నను దాని సౌరభము బయటికి వచ్చునటుల బీదగృహస్థుఁడగు కృష్ణచంద్రుని గుణగణముల విషయమై రాజపురుషులు శీఘ్రముగా గ్రహించి ఆయనకు నవాబుసర్కారుసం దుద్యోగము నిచ్చిరి. అప్పటినుండి యీయనకు మంచి దశపట్టినది.

ఉద్యోగమునఁ బ్రవేశించినది మొదలు కృష్ణచంద్రుఁడు తన గుణమునందును గార్యకౌశలమునందును శక్తిసామర్థ్యము లను జూపుటచే నున్నతపదవి నొందఁగలుగుటయేగాక, 'రాయ్' బిరుదమునుబొంది దానితోఁబాటు ధనార్జనాభివృద్ధినిగూడఁ బడయఁగలిగెను. కాని దానివలన ఆయన స్వభావ మేమియు మార్చ

కొనక పూర్వమువలెనే శాంతస్వభావుఁడును, నమ్రచేతస్కుఁడును, న్యాయవంతుండును సత్యవాదియు నై యుండెను. ఆ సమయమునం దాయనకు రాజసర్కారు పెద్దహోదా నిచ్చి కృష్ణనగరమునకు బదిలీచేసిరి.

భగవానునిదయచేఁ గృష్ణచంద్రుఁ డింతయున్నతపదవిని హోదాను ధనలాభమును బొంది రాత్రింబగల్లు మనోవాక్కాయకర్మలతో భగవానుని యారాధనయందు నిమగ్నుఁ డాయెను. తత్ఫలితముగా నాయన తన యిష్టదైవముయొక్క ప్రసాదమును బొందిరి. ఆయనయొక్క మనఃప్రాణములు భక్తిరసమునందు మునిఁగిపోయెను. ఆస్థాన మాయనకు బృందావనముగాఁ గాన్పించెను. ఆస్థానమును వీడి యన్యస్థానమునం దొక్కయడుగైనను బెట్ట నాయన కిష్టము లేకుండెను. ఆయన యచ్చటనే రాధానగరమనుచోట వాసము నేర్పఱచుకొనిరి. అప్పటినుండియు వారి వంశమువారికి 'రాధానగర' మే వాసస్థానమయ్యెను.

కృష్ణచంద్రునకు ముగ్గురు కుమారులు. వారిలోఁ గనిష్ఠుఁడు వ్రజవినోదుఁడు. వ్రజవినోదుఁడుకూడఁ దండ్రివలెనే పరమధార్మికుఁడును మహాపండితుఁడును బహుసద్గుణవంతుఁడు నై యుండెను. ఆయన తండ్రివలె నవాబుసర్కారునం దుద్యోగముఁజేసి యున్నతపదవినిబొంది యధికధన మార్జించి పైతృక ధనభాండాగారము నభివృద్ధిఁ జేయఁగలిగెను. అపుడు హుగ్లీ జిల్లాయంతయు మన " రాయ్ " వంశమువారిపేరుప్రఖ్యాతు

లతో నిండిపోయెను. అందఱకును వారు మిక్కిలి గణ్యులును మాన్యులును నగుజమీందారులుగా నుండిరి.

వ్రజవినోదున కేడుగురు కుమారులు గలిగిరి. అందఱును రాయవంశమునకుఁ దగినవారే. వారిలో నయిదవవానిపేరు రమాకాంతరాయలు.

రమాకాంతరాయలు రాయవంశమునకు, గౌరవస్వరూపముగా నుండిరి. విద్యావిషయమందేమి, స్వభావచరిత్రయందేమి, బుద్ధివివేచనయందేమి, ఆచారవ్యవహారములందేమి వారందఱిలో శ్రేష్ఠతరుఁడుగా నుండెను. ఆయనకుఁగల పితృభక్తి శ్రీరామచంద్రుని పితృభక్తివంటి దని దేశమంతటను వ్యాప్తినొందెను. ఆయన పితృవాక్యపాలనార్థమై నిజకులము నుల్లంఘించి యితర కులమునందు వివాహమాడి పితృవాక్యమును నిలిపెను.

అపుడు రమాకాంతుని తండ్రియగు వ్రజవినోదునకు మృత్యుకాల మాసన్నమైయుండెను. మరణశయ్యపై హరినామగానమొనర్చుకొనుచు గంగయొడ్డున నుండెను. అట్టి సమయమందు శ్రీరామపురాంతర్గతమగు 'చాతరా' గ్రామమున నివసించు శ్యామభట్టాచారి యను నౌకరు వచ్చి తనకొక వరమిమ్మని వేఁడుకొనెను. మృత్యుపథగామియగు వ్రజవినోదుఁడు వారికోరికను గ్రహింపలేక, "మీ కేమి కావలె నని" యడిగిరి. "నేనుగోరునది యిచ్చెదనని" వాగ్దానముచేసినచోఁ జెప్పెద" నని శ్యామభట్టాచార్యుఁ డనెను.

" నాశక్తి ననుసరించి యిచ్చెద " నని వ్రజవినోదుఁడు బదులుచెప్పెను. "అంతవఱకే నాకుఁ గావలసినది" యనిభట్టాచార్యుఁడు ప్రాంజలియై విన్నవించుకొనెను. వ్రజవినోదుఁడు సరళమతియు, నుదారస్వభావుఁడును, మహాచరిత్రసంపన్నుఁడును, దానశీలుఁడును గావునఁ దన యంత్యసమయమందు సాంసారిక విషయములం దాసక్తి తగ్గియుండుటచేతను, వెనుదీయక "నేను వాగ్దానముచేయుచున్నాను, మీరు కోరునది యిచ్చెద" ననిరి.

శ్యామభట్టున కపుడు చేయిచాఁచి స్వర్గ మందుకొనినట్లయి "నాకుమార్తెను మీకుమారులలో నొకని కిచ్చి వివాహము చేయవలె" నని ప్రార్థించిరి.

శ్యామభట్టాచార్యుని మాటవిని యందఱు నాశ్చర్యపడి యూరకుండిరి. రాయవంశీయులు కులీలును, బరమవైష్ణవులును, భట్టాచార్యులును, శాక్తేయులును, గనుక రాయవంశము వారి పుత్రునకును, శ్యామభట్టుని పుత్రికకును వివాహము జరుగుట యసంభవము. కాని వ్రజవినోదుఁడు వాగ్దానముఁ జేసితి ననెఁ గాన దానిని దప్పించుకొనుటెట్లు? వంశగౌరవ మెంత న్యూనత నొందినను, లోకు లెంతనిందించినను, సంఘమెంత తృణీకరించినను ఈవివాహము జరుగవలసినదే! కానిచో వ్రజవినోదుఁడు సత్యవాక్యభ్రష్టుఁ డగును. సత్యము భ్రష్టమగుట మహాపాపము. ఈమరణకాలమం దాయన యిట్టి విషయము నెట్లు భరింపఁగలరు?

వ్రజవినోదుఁడు పుత్రులనందఱు నొక్కొకరినే పిలిచి భట్టాచార్యులవారి కొమార్తెను వివాహమాడుమని చెప్పెను. కాని కులభ్రష్టతయగుననియు, సాంఘికావమానము భరింపవలసి వచ్చుననియుఁ, గులమువారినుండి వేఱైపోవలసివచ్చుననియు భయపడి యెవ్వరు నిష్టపడరయిరి. ఆయన మిక్కిలి చిక్కులోఁబడి, నలువైపుల నంధకారమునే గాంచెను. సత్యభ్రష్టుఁడు కావలసివచ్చెననుచింతచేఁ బాప మాయన నేత్రియుగళ మశ్రువులతో నిండిపోయెను.

రమాకాంతుఁ డింతదనుక నన్నియుఁ జూచుచు విను చుండెను. తండ్రియవస్థఁ జూచి, వారినేత్రములనుండి కాఱు నశ్రువులను గాంచి వగచి పితృభక్తిప్రపూర్ణహృదయుఁడై సంఘ భయమునుగాని, లోకులయవమానమునుగాని పాటింపక యందఱి యెదుట నిలువఁబడి యిట్లు నుడివెను. "నాయనా! మీరు నిశ్చింతగా నుండుఁడు; నేను మీయాజ్ఞచొప్పున భట్టాచార్యుని కుమార్తెనే వివాహమాడెదను.

వ్రజవినోదునకు మహాసముద్రమునందు నావ దొరకి నట్లాయెను. మనసార రమాకాంతుని నేకాంతముగ నాశీర్వదించెను. మంచిసమయమున రమాకాంతరాయి శ్యామభట్టాచార్యుని కన్యయగు "తారిణీదేవిని" వివాహమాడి గృహమునకుఁ దోడ్కొనివచ్చెను.

తారిణీదేవి యాకాలపు వైదికనిష్ఠావంతుఁ డగుబ్రాహ్మ

ఋనియింపి కన్యయగుటచే బ్రాహ్మణునిగృహమం దెన్నివిధ ములయిన పూజార్చనలు, వ్రతనియమములు, నాచారానుష్ఠానములు జరుగు టుచితమో, యవియన్నియు నామె పితృగృహమందు జరుగుచుండెడివి. చిన్ననాఁటనుండి యవి యన్నియుఁ జూచియట్టి స్వభావమునుబొంది యామె పరమభక్తురాలును, బవిత్రహృదయముగలనారీమణియుఁ, బరమధర్మబుద్ధి సంపన్నురాలునాయెను. కావున రమాకాంతరాయునితోఁ దారిణీదేవి సమ్మేళనము పార్వతీపరమేశ్వర సమ్మేళనమువలె నుండెను. రాయ వంశము యొక్క భవిష్యద్గౌరవవృద్ధికిఁ గారణమాయెను.

ఈదంపతులకొక పుత్రికయు, నిరువురు పుత్రులును గలిగిరి. అందుఁ గడపటివానికి 'రామమోహన' యను పేరు పెట్టిరి. వీరే భవిష్యత్తునందు 'రాజా రామమోహనరాయ'లను నామమునఁబరఁగి దేశమునందు సుస్థిరకీర్తిని గడించి సార్థకజన్ములయిరి.

రామమోహనుఁడు జమీందారునిపుత్రుఁడు గానఆయన యట్లే సమస్తవైభవములతోఁ బెరుఁగుచుండెను. శైశవమునం దొకప్పుడు మామగారి గృహమందును, మఱొకప్పుడు తండ్రి యొద్దను నుండి, యందఱికిని నేత్రపర్వముఁ జేయుచుండెను.

ఒకసారి యాయన తల్లిగారితో మామగారి గృహమున కేతెంచెను. వృద్ధుఁ డగు శ్యామభట్టుఁడు మనుమని నొడియం దిడుకొని లాలించువాఁడు. మనుమఁడును నెల్లప్పుడు తాతగారికి

స్నేహితుఁడై నానావిధఖేలనములచే నాయన కానందము నొసఁగుచుండెను. పూజాపురస్కారముల వేళలనేమి, యాహారవిహార సమయములందేమి, అన్నివేళలందు నతఁడు తాతగారితో నుండెడువాఁడు.

ఒకదినమున తాతగారు పూజయందుండిరి. మనుమఁడు చెంతఁగూర్చుండి చూచుచుండెను. పూజ పూర్తియగుసంతనే యతఁ డాయనచేయి పట్టుకొనెను. భట్టాచార్యులు దేవప్రసాదముగ నొక బిల్వపత్త్రమును మనుమని చేతియందుంచి యాశీర్వదించెను.

మనుమఁ డాయాశీర్వాదమును గ్రహింపక బిల్వపత్త్రమును భక్తితో శిరముపై నుంచుకొనక వెంటనే నోటఁబెట్టుకొని నమలఁజొచ్చెను. రామమోహనుని తల్లి యా దృశ్యమును జూచి పరుగిడివచ్చి కుమారుని నోటినుండి బిల్వపత్త్రమును బయటికిఁ దీసివైచెను. అంత నామె తనతండ్రినిగాంచి 'ఇదేమి నాయనా? రామమోహనుఁడు పరమవైష్ణవవంశసంతానముగదా? మీ రాతనికి బిల్వపత్త్రమును దినిపించితి రేమి? ఇంత యన్యాయమా?' అని పలికెను. సుమార్గమాట విని యామెయొక్క మూర్ఖత్వమునకుఁ గినిసి భట్టాచార్యులవ్వంతి కోపోద్రిక్తులై "నీ యీ కొమారుఁడు "విధర్మి" యగు" నని శపించెను.

ఈసామాన్యవిషయ మింతయగునని పాపము తారిణీదేవి స్వప్నమందైనను దలంపదాయెను. తండ్రి శపించుటఁగాంచి యామె హృదయము కంపించెను. ఆమె యింక స్థిరముగ నుండఁజాలక యేడువ నారంభించెను. అది గాంచినంతనే తండ్రికి జాలి కలిగెను. మిక్కిలి యనుతాప మొందెను. నిమిషమున నుండి నిమిషమునఁ జల్లారుట బ్రాహ్మణుల స్వభావము. ఆయన తన కుమార్తె ననేకమృదూక్తులచే నోదార్చెను. "నేను జెప్పిన దెప్పటికిని విఫలముగాదు, చింతింపకుము, విచారించకుము— యీ నీపుత్రుఁడు సంసారమునం దసాధారణవ్యక్తిగాఁ బరిణమించును. దేశవిదేశములయం దీతని నందఱును బూజింతురు. ఉన్నతరాజసన్మానమునుబొంది మంచిపేరును గీర్తిని గడించును."

తాతగారి యాశాపము రామమోహనుని భవిష్యజ్జీవితమునం దాశీర్వాదమై ప్రత్యక్షప్రమాణముగా ఫలించినది.

---

## ద్వి తీ య ప్ర క ర ణ ము.

శైశవమునందు విద్యార్జనతోఁబాటు మనుజుఁడు తనభవిష్యజ్జీవితమునుగూడ నిర్మించు కొనుచుండును. రామమోహనుని భవిష్యద్గౌరవాంకురముగూడ యతని శైశవజీవితమునందు విద్యార్జనతోఁబాటు వికసిత మగుట కారంభించెను.

అయిదవసంవత్సరమున నక్షరాభ్యాసారంభము నుండియు

నతని జ్ఞాపకశక్తియుఁ బ్రతిభయుఁ బ్రకాశితము కాఁజొచ్చెను. దీనికి ముం దతిబాల్యముననే యతఁ డేక్షేత్రవిషయము విన్నను, జూచినను, వెంటనే నేర్చుకొనఁగలిగి యుండెడువాఁడు. అడిగి నంతనే చెప్పఁగల్గియుండెడువాఁడు. యేక్షేత్రవస్తువును జూపినను నిమిషమున గ్రహింపఁజాలియుండెడివాఁడు. ఇవియన్నియుఁజూచి లోకులెంత యాశ్చర్యపడినను బడకున్నను, అక్షరాభ్యాసము మొదలుకొని యతనిమేధాశక్తియుఁ బ్రతిభయు నత్యంతాభివృద్ధి నొందుటఁగాంచి యందఱును మిగులనాశ్చర్య మొందఁదొడఁగిరి.

అక్షరాభ్యాసము మొదలు పాఠశాలకు వెడలి వంగ భాషను నేర్చుకొనుచున్నటులే యా సమయమందే—యా యయిదవయేటనే—దానితోఁబాటు—తన యింటియొద్ద పార సీభాషనుగూడ నేర్చుకొనమొదలిడెను. ఒక్కసారి యీ రెండు భిన్నభాషలు నేర్చుకొనుటలో నాతఁడు చూపినశక్తి యద్భుత మైనది.

పగలంతయుఁ బాఠశాలయందుండుటచే బాలురప్రాణ ము లలసియుండును, గనుక బడివిడిచినంతనే యింటికిఁ బరుగిడి వచ్చి యాటలలో నిమగ్ను లగుదురు. అనేకులకుఁ బుస్తకము లనైన సరిగఁ బెట్టుకొనుట కవకాశముండదు. కాని రామమో హనున కట్లుకాదు. భగవానుఁ డాయనప్రకృతి నన్యవిధముగా నిర్మించెను. కావుననే రామమోహనుఁడు పాఠశాలనుండి తిరిగి వచ్చి యాటపాటలమాట యటుండ నాహారవిషయముఁగూడ

మఱచి గ్రంథాధ్యయనమును జేయమొదలిడుచుండువాఁడు. దినమంతయుఁ బాఠశాలయందు వంగభాషను జదివి, యింటికి వచ్చినతోడనే పారసీభాష నేర్చుకొను చుండెడువాఁడు. తల్లి దండ్రు లాడుకొను మనియు, విశ్రమింపుమనియుఁ జెప్పినను విను వాఁడుకాఁడు. పెద్దపెద్దగ్రంథముల పుటలలోఁ బ్రచురితము లగుచుండు మహావిషయములను గ్రహించుట కాయన మన స్సాతురపడు చుండెడిది. ఒక్కదినమందే యన్నియుఁ బూర్తి చేసిన హాయిగా నుండునన్నంత యాతురతతోఁ బుస్తకములను జూచుచుండెడివాఁడు.

ఇట్లాయన చదువుసంధ్యలయం దత్యంత శ్రద్ధాసక్తులను గలిగి యుండెడివాఁడు. మనస్సునకు నచ్చినదానినే బాలురు చేయుచుందురు. భవిష్యత్తునందుఁగూడ వారలస్వభావ మట్లే పరిఢల్లుచుండును. చదువుసంధ్యలయం దట్టి శ్రద్ధాసక్తులుండుట చేతనే ఆయన కేకాగ్రతచిత్తయు, ధ్యానశక్తియు నభివృద్ధి చెందెను. దానితోఁబాటు పరిశ్రమచేయు శక్తియుఁ బెంపొం దెను. క్రమముగఁ బట్టుదల మెండయ్యెను. కావున మనుజుఁడు కావలె నన్న శైశవమునందే యేసాధన లావశ్యకములో యట్టి శ్రద్ధ, పరిశ్రమ, ధ్యానశక్తి, యేకాగ్రత, పట్టుదల మొదలుగాఁ గల సకల సద్గుణములను బొంది తరువాత భవిష్యత్తునందొక మహోన్నతమార్గమున నడువఁగలిగి యుండును.

అట్టికృషికి ఫలితముగా, నయిదవయేటనుండి యెనిమిదవ

యేటివఱకుఁ గల యీమూఁడేండ్లలో ఆయన బెంగాలీ, ఫారసీ భాషలను బాగుగా నేర్చుకొనెను. ఆయనకుఁ గల యీయద్భుత శక్తి నిగాంచి హిందువులేమి, మహమ్మదీయులేమి, పండితులేమి యందఱు నాశ్చర్యమొంది వేనోళ్లఁ బొగడఁజొచ్చిరి.

అప్పటిదినములలో ఫారసీ, యరబ్బీభాషలే రాజభాషలై యుండెను. ఇంగ్లీషు అప్పుడే యారంభమగుచున్నది. ఆ రెండు భాషలలోనే సమస్తకార్యకలాపములును జరిగెడివి. అందుచే "అరబ్బీ, ఫారసీ" భాషలను బాగుగా నేర్చుకొనకున్నచో నెవరును బండితు లనిపించుకొనుటలేదు.

బాలకుఁడైన రామమోహనుఁడు పిన్ననాఁటనే లెస్సగా ఫారసీ నేర్చుకొనినపుడు అందఱు నాయనతండ్రితో నిట్లనిరి. "ఈబిడ్డ భవిష్యత్తునం దొక యుజ్జ్వలరత్న మగును. ఇట్టి అసాధారణశక్తి యెచ్చటను గాన్పింపదు. కావున నీతని భవిష్యత్తును వ్యర్థపుచ్చక వెంటనే యరబ్బీ నేర్పించుట కేర్పాటులు గావింపుఁడు."

కాని రామమోహనున కరబ్బీ నేర్చుకొనుట కొక యాటంకము గలిగెను. అపుడు పాట్నాయందు 'మూలవి' లా విద్యయందుఁ బండితులై యుండిరి. అట్టియుపాధ్యాయులు మఱి యేయితర దేశమందును లేకుండిరి. అందుచే నరబ్బీ నేర్చుకొనవలెనన్న పాట్నాయందే నేర్చుకొనవలసి యుండెను.

రామమోహానుని వయస్సు తొమ్మిది వత్సరములు. ఆయన తలిదండ్రులు, నాత్మీయులు నందఱును వంగదేశవాసులై ఉద్యోగసందర్భమున వంగదేశమందే యున్నందునఁ బాట్నా యందుఁ బరిచితు లెవ్వరును లేకుండిరి. ఆ చిన్నబిడ్డ నొంటరిగా నాపాట్నాయం దుంచి యరబ్బీభాష నెట్లు నేర్పింపఁగలరు?

ఇట్టి యద్భుతశక్తిసంపన్నప్రతిభాశాలియగు బాలకుని విద్యకై యేర్పాటు గావింపకున్నచో నాతని భవిష్యత్తంతయు వ్యర్థమైపోవును. ఆప్రతిభ, యాశక్తి, విపథగాములై సంసారమునకుఁ గంటకప్రాయములు గాఁగలవేమో యెవరు చెప్పఁగలరు? కావున నెట్లైనను బాలకుని విద్యకుఁ దగిన యేర్పాటులు చేయవలసియే యుండెను.

ఇదియునుగాక యాబాలకునికి దానిపైఁగల పట్టుదల యెంత! ఒక నూతనవస్త్రమునకో లేక యాటవస్తువునకో బాలుర మనస్సాతురతఁ జెందునటుల అరబ్బీమాట యెత్తినంతనే రామమోహానుని మనస్సు తహతహలాడుచుండెను. "ఎప్పుడు పాట్నాకు వెళ్లుదునా, యెప్పు డరబ్బీ నేర్చుకొందునా" యని యతఁ డువ్విళ్ళూరుచుండెను. ఆహారములేదు; నిద్రలేదు; ఆటలు లేవు; పాటలులేవు. కేవల మరబ్బీమాటయేకాని, వేఱొక ప్రసంగమే లేదు. రామమోహానుని యీయాతురత, యీయుత్సాహము, నాఱిపోయినచో నాతనిమనస్సు నిరాశచేఁ గ్రుంగిపోవచ్చును. నానావిధములైన యనిష్టములు సంభవింప

వచ్చును. కాఁబట్టి రామమోహనుఁడు అరబ్బీ నేర్చుకొనుట కేర్పాటులుచేయుట యత్యావశ్యకమయ్యెను. ఆకారణమున రమాకాంతుఁ డట్లుచేయసమ్మతించెను.తుదకుఅనేకపర్యాయము లాలోచించి బాలుని పాట్నా యందుంచి యరబ్బీ నేర్చుకొను టకుఁదగిన యేర్పాటులు గావించెను. తొమ్మిదేండ్లప్రాయమున మన రామమోహనుఁడు పాట్నాకువెళ్లి యొకసుప్రసిద్ధపండితుని యధీనమునందుండి యరబ్బీ నేర్చుకొన నారంభించెను. అచ్చటి కరిగినదిమొదలు రామమోహనుని జీవితమునం దొక ప్రధాన పరివర్తన ముద్భవించెను.

తొమ్మిదేండ్లనుండి పండ్రెం డేండ్లవఱ కాతఁడు పాట్నా యందు మౌలవీపండితుని యధీనముననుండి బాగుగా నరబ్బీ భాష నేర్చుకొని ముగించెను. మహమ్మదీయమతగ్రంథాధ్యయ నముచేతను,వారలతో నిత్యమును,గలసిమెలసి యుండుటచేతను వారి యాచారవ్యవహారముల ననవరతము నవలోకించుటచేతను ముఖ్యముగ నట్టిమార్పు కలిగెను. ఆయన క్రమముగాఁ దన పూర్వాచార ప్రతిమాపూజయందుఁ బ్రీతిరాహిత్యమును, కోపమును జెంద మొదలిడెను. తత్ఫలితముగాఁ దుద కేకమాత్ర నిరాకార పరమేశ్వరారాధనపరుఁడై ప్రతిమాపూజకు ఘోర విరోధి యయ్యెను.

ఆతని ప్రతిభ యద్భుతమైనది. ఆ ప్రతిభాబలముచే ద్వాదశ వత్సరములకే యతఁడు బెంగాలీ, పారసీ, అరబ్బీభాష

లలో మహాపండితుఁ డాయెను. జ్ఞానాభివృద్ధి యగుచున్న కొలఁదిని యుక్తముగాఁ దర్కముఁజేయు శక్తి గూడఁ బెంపొందుచుండెను. దానిపై నుపన్యాస మిచ్చుశక్తియు నలవడుటచే నాయన కింక బంగారమునకుఁ బరిమళమబ్బినట్టు లయ్యెను. తరువాత నాయన ప్రతిమాపూజకుఁ బ్రతిపక్షియై నిలఁబడి నిరాకారేశ్వరవాది యైనపుడు ఎవరును దర్కమందుఁగాని యుక్తియందుఁ గాని సంభాషణయందుఁగాని యాయన నోడించి పూర్వాచారుల దేవ దేవతలపూజకు సపక్షముగా నుండునటుల నాయనను దేలేక పోయిరి. అట్టి స్థితిలో నాయన యరబ్బీముగించి స్వమతసిద్ధాంత ములను బూర్తిగా గ్రహింప, సంస్కృతము నేర్చుకొనుటకై కాశికిఁ బయన మయ్యెను.

---

## తృతీయ ప్రకరణము.

ద్వాదశవత్సర వయస్సునందు రామమోహనుఁడు కాశీ పురమునకుఁ జని, నిరంతరపరిశ్రమతోను, అత్యధికైకాగ్రత తోను, విపులమగు నుత్సాహముతోను సంస్కృతము నేర్చు కొన నారంభించెను. అతి శీఘ్రకాలములోనే యాతఁడా భాషను గూడ స్వాయత్తము జేసికొనఁగలిగెను.

పాట్నాలో వసించు కాలమున నేక్షణామం దాయన

మనస్సులోఁ బ్రతిమాపూజపై నభక్తియు విద్వేషమును జన్మిం చెనో గాని యాక్షణమునుండియే యాయన హృదయమున నే కేశ్వరారాధనా సత్యాన్వేషణాశక్తి హెచ్చనారంభించెను. ఏ ధర్మ ముత్కృష్టమైనదో, యేధర్మము నిష్కళంకమైనదో, యెయ్యది పరమధర్మసముచితారాధనమో, యెయ్యది ధర్మేత రానుష్ఠానమై మనుజుని కష్టముల పాల్సేయునో, అట్టి విషయముల నాలోచించుటకై యాయన వేదవేదాంత ములను జదువనారంభించెను. ఆయనప్రతిభ—అద్భుతమైనది. పరిశ్రమశక్తి—అనంతమైనది. కావున నత్యల్పకాలమునందే ఆయన యాయాయుత్కృష్ట మతగ్రంథములఁ బరిశీలించి యపార పాండిత్యమును సంపాదించెను. తత్ఫలితముగా ఆయ నకుఁగల నూతనభావములెల్ల మఱింత దృఢములు కాఁజొచ్చెను.

వేదాంతాధ్యయనముచేఁ బ్రతిమాపూజపై దృఢమగు నశ్రద్ధ స్థాయీభావముఁ దాల్చెను. ఉపనిషత్తులు పఠించుటచే నాతని జ్ఞాననేత్రములయెదుట నొక నూతనజ్యోతి ప్రజ్వలింపఁ జొచ్చెను.ఆజ్యోతిచేతనే యాయన యాంతర్యమునందు బ్రహ్మ జ్ఞాన ముదయించెను.

ప్రకృతహైందవత్వమేది? యథార్థమగు హిందు వెట్లుండ వలెను? వైదికహిందూధర్మము శ్రేష్ఠమైనదనియు, సర్వోన్నత మైనధర్మమనియు నాయన యాలోచించి గ్రహించినకొలఁదియు నాకాలపు హిందూసంఘముయొక్క సంకీర్ణతయు, నైచ్యస్థితియు

మఱింత హెచ్చుగా గోచరించి సంస్కారముల తిరస్కారము లపై దృష్టిపడుటచే నాయన సంఘమునకు భయంకరద్వేషిగాఁ బరిణమించెను. సహజముగా నాయన యత్యంతస్పష్టవాదియు, నిర్భీకస్వభావుఁడు నయినవాఁడు. అందుచే వయోవృద్ధుల దోషములఁజూచినను నుపేక్షించువాఁడుకాఁడు. వారల యన్యాయ ప్రవర్తనములను సహింపలేకుండెడివాఁడు. ఆయన వయసున బాలకుఁడైనను వయసునఁ దనకంటెఁ బెద్దలైనవారల యెదుట నిలఁబడి విస్పష్టములగుమాటలతోఁ దర్కించుచుండెడివాఁడు.

అల్పవయస్సుగల బాలుఁడు కాశివంటి మహావిద్యాస్థానమునఁ దమ దోషములను జూపి వాద ప్రతివాదములుచేయుటఁ గాంచి పెద్దపెద్దబ్రాహ్మణపండితు లందఱు లోలోపల రామమోహానునిపైఁ గ్రోధము వహింపనారంభించి, రామమోహానుని యెట్లయిన నోడించి, కాశీపురమునుండి తరిమివేయ సంకల్పించుకొనిరి. కాని వారిలో న్యాయమత, శాస్త్రయుక్తితర్కముల ద్వారా రామమోహాను నోడించి యరికట్టఁగలవా రొక్కరును లేకుండిరి. బాలకుని యద్భుతపాండిత్యమునకును, శక్తికిని లోలోనఁ నచ్చెరువొందుచు బయటికి "నాస్తికుఁ" డని నిందించి తిరస్కారముతో నాతనిమాట లెగురఁగొట్టివేసి లోపలికోపము నార్చుకొనుచుండిరి.

రామమోహానుఁ డాపండితవరేణ్యుల యట్టి యసహాయావస్థను జూచి నవ్వుకొనుచుండెను, కాని వారల యక్రియా

త్యాచారముల నేమాత్రమును సహించి యూరకొనలేకుండెను. ఆయన హృదయమునందు భగవానుఁ డేజ్వల్యమాన విజ్ఞాన జ్యోతిని వెలిఁగించెనో యాజ్ఞానతేజముయొక్క సాహాయ్యమునఁ బ్రధానధర్మరక్షణార్థమై నూతనమార్గ మవలంబింపఁ గృత నిశ్చయుఁ డాయెను.

కేవలము రెండుమూడుచోట్ల నలుగురి నొకచోఁజేర్చి ఛాందసుల దోషములఁ జూపించి ముఖాముఖిని వాదప్రతివాదము లొనర్చిన లాభములేదనియు, సమస్తదేశముల నీవిషయమై యాందోళనపుట్టించినఁగాని యీమాఢ్య మంతరింప దనియు నాయన గ్రహించెను. ఇట్లన్నియు నాలోచించి ప్రకృతమునఁ బ్రతిమాపూజ వారించుటకై దానివలని యనర్థముల నానావిధములైన యుక్తివాదములద్వారా తెల్లము సేయుచు నొకగ్రంథమును రచించిరి. అపు డాయన వయస్సు పదునాలుసంవత్సరములు మాత్రమే. ఆగ్రంథరచనయం దాయనయొక్క నిష్పక్షపాతబుద్ధియుఁ బాండిత్యవిశేషమును, సూక్ష్మాతిసూక్ష్మధర్మతత్త్వవినిర్ణయశక్తియు యుక్తియుక్తముగఁ బ్రదర్శింపఁబడెను. ఆగర్భశ్రీమంతుని బిడ్డయగుటచే—ధనాభావము లేదుగనుక వెంటనే యాప్రథమపుస్తక మచ్చొత్తింపఁబడి ప్రకటింపఁబడెను; అందుచే నలువైపుల గొప్ప యాందోళన చెలరేగెను—రామమోహనుని 'నాస్తికుఁ' డనియు, 'విధర్మి' యనియుఁబ్రజలు తూలనాడ నారంభించిరి.

అనంతరము సంస్కృతాభ్యాసమున స్వమత సత్యాన్వేషణమును బూర్తిచేసికొని రామమోహనుఁడు కాశీనగరము నుండి స్వగ్రామమునకుఁ దిరిగి వచ్చెను. తన యభిప్రాయముల నచ్చటఁ దన పుస్తకములద్వారా వెల్లడిచేయుట కారంభించెను. అపు డాయన నందఱు ననేకవిధముల నిందించి గేలిచేసి బహు విధములఁ దూలనాడఁ జొచ్చిరి. తల్లిదండ్రులు, నాత్మీయబంధువులు నానిందల నోర్చుకొనలేకపోయిరి. వార లాతని కనేక విధముల బోధించి ఆ యాలోచనలనన్నిటినిద్యజించుమనియు, ఆపుస్తకముల నన్నింటిని ధ్వంసముచేయు మనియు బతిమాలిరి. కాని రామమోహనుఁడు వారిమాటలకుఁ జెవియొగ్గక ధైర్యమూని తన యత్నములను మానఁ డాయెను. అపు డాతనిని శాసించి లోఁబఱచుకొను నుద్దేశముతో నాతనితండ్రిగారు ధర్మసంబంధీయవాదము లన్నియుఁ ద్యజింపనిచో నిలు వెడలఁగొట్టెద మని భయపెట్టిరి. కాని నిర్భీకుఁడును, స్వాధీన చేతస్కుఁడును బండితుఁడు నైన బాలక రామమోహనునిహృదయమునం దెట్టి భయమునకును దావులేకుండెను. ఇది గాంచి పరమవైష్ణవుఁడును బూర్వాచార పరాయణుఁడునైన రమాకాంతరాయలు మిక్కిలి కోపముఁజెంది, పుత్రునిపై మమతను ద్యజించి యింటినుండి వెడలఁగొట్టెను.

రామమోహనుఁడు దానికిని జంకలేదు. షోడశవర్షమాత్ర ప్రాయుఁడై యుండియు గృహమునువీడి, బంధుమిత్రుల స్నేహా

మును బోఁగొట్టుకొని కాతరుఁడు కాలేదు; నిరుత్సాహమును బొందలేదు; తనకాళ్లపై నిలఁబడ నేర్చుకొనుటకై పరమోత్సాహముతో హృదయము నున్నతపఱచి నిర్భరుఁడై కృతార్థుఁడయ్యెను. ఆయాత్మనిర్భరతయే భావికాలమున రామమోహనుని యశోన్నతాసనమునం దాసీనునిగఁజేసి ఆయననామమును, గీర్తిని యితిహాసమునం దాచంద్రతారకముగఁ బ్రకాశింపఁజేసి యుంచినది.

అప్పటి దినములలో నీకాలపుసౌకర్యములుగల రాజమార్గములులేవు. రైళ్లుగాని స్టీమర్లుగాని లేవు. ఎడ్లబండ్లైనను గుఱ్ఱపుబండ్లయినను లేవు. మార్గములన్నియు నడవులతో నిండియుండుటచే భయానకములుగ నుండెను. ఆమార్గములందు దారిదోపిడి గాండ్రయుపద్రవము హెచ్చుగా నుండెడిది. అందుచే దేశదేశాంతరములకు రాకపోకలకు మిక్కిలి కష్టతరముగాను, అపాయభూయిష్ఠముగాను నుండెడిది.

కాని, పదునాఱువత్సరముల బాలుఁడు రామమోహనుఁడవి యన్నియు లెక్కసేయక గృహమునుండి వెడలఁగొట్టఁబడి కేవలము తన స్వశక్తిపై నాధారపడి నడచిపోవుచు నందందు గోచరించు ప్రాకృతసౌందర్యదృశ్యరచనావిశేషములనుగాంచుచు మఱింత జ్ఞానాభివృద్ధిని బడయఁజొచ్చెను. ఏయేకారణములచేఁ దన సంఘమింత యధఃపతితమగుచున్నదో యాకారణముల నన్నిటిని స్పష్టముగా నిపుడు తన జ్ఞాననేత్రమునఁ గాంచఁ గలి

గెను. ఈవిశ్వజనీనాదర్శవిజ్ఞానముల మూలమున నా రామ
మోహనుఁడు తన భావిమార్గము నేర్పఱచుకొనెను.

రామమోహనుఁడు జమీందారుని బిడ్డయైనను — ఆ
జన్మము సుఖాసనమునం దాసీనుఁడై యుండినను విచలితుఁడు
కాఁడాయెను. శారీరకకష్టముల నన్నిటిని నిర్భయముగా సహిం
చెను. తన కేవలైహికసుఖలబ్ధికిఁగాని, విలాసవైభవముల వైపు
నకుఁగాని తనదృష్టిని బోనీయకుండెను. మహాయోగివలె నశ్వర
సంసారసుఖములం దన్నిటియందు నుపేక్షాభావము వహించి
కేవలము తన కార్యసాధనమున కుపాయ మవలంబించుచుండెను.

ఈవిధమునఁ దిరుగుచు నతఁడు చిన్నవయస్సుననే హిమ
వన్నగోత్తరభాగమునకుఁబోయి టిబెట్టుదేశమునఁ బ్రవేశించెను.
కొంతకాల మచ్చట నున్నవెనుక యాదేశభాషలైన తురాని
యన్ భాషలఁజదివి, యచ్చటి మతసంబంధములైన యుద్గ్రంథ
ములను బరిశీలించుటచేత నాదేశవాసులయొక్కయు, నజ్ఞాన
పూర్ణమూఢాచారము లాతని తీక్ష్ణదృష్టి నాకర్షించెను.

అచ్చటి ప్రతిమారాధనయు, మనుజుని దేవతగా నెంచి
పూజించుటయు, బహుభర్తృస్వీకారాదులగు దురాచారములు
నతనికి ధర్మవిరుద్ధములుగాఁ దోఁచెను. వెంటనే సత్యబోధగావిం
చుచు నచ్చటి ప్రజల నాందోళపఱచి యుపన్యాసములీయ
నారంభించెను. అపు డచ్చటివారందఱు నాయనకు ఘోరశత్రువు
లైరి. ఆయనకుఁ బ్రాణాపాయముగూడ సంభవింపనుండెను.

దయాస్వభావముగల కొందఱు సాధ్వీమతల్లుల సాహాయ్యమున నాతఁడు మృత్యువుఁదప్పి నిరపాయుఁడయ్యెను. అప్పటినుండియు నారీలోకముపై నాయనహృదయమునం దపారశ్రద్ధాభక్తిసమ్మానము లుదయించెను. ఆ నారీమణుల దయచే ఆయన ప్రాణము దక్కినను, అచ్చటి మతబోధకు లంద ఱాతనికిఁ బరమశత్రువు లగుటచేఁ గష్టపరంపర లతిశయించుచుండెను; కాని అచంచలహృదయమును నిర్భయదృఢచిత్తమును గల రామమోహనుఁడు దానికేమాత్రమును తొణఁకక ప్రాణముపై నాశయు, దైహిక కష్టమును, దేశవాసుల శత్రుత్వమును వీని నన్నిటి నుపేక్షించి శేయింబవ ఖ్యాతఁడు తన కర్తవ్యనిర్వహణమునందు నిమగ్నుఁడై యుండెను. ఇట్లుండ స్వగ్రామమున రామమోహనుని తండ్రి పుత్రుని దురవస్థవిషయమై కర్ణాకర్ణికగా విని, ప్రాణము తల్లడిల్ల, నిశ్చింతగా నుండఁజాలక టిబెట్టునుండి పుత్రుని బహుప్రియత్నము లొనర్చి యింటికి రానించుకొనెను. అపుడు రామమోహనుని వయస్సు ఇరువదియేండ్లు. అట్లు రామమోహనుఁడు స్వగ్రామమును జేరి, మునుపటివలెనే తనకును దల్లిదండ్రులకునుగల విగ్రహారాధన విషయమైన భేదభావములు మరల వృద్ధిజెంద, దానిఫలితముగా వారినుండి వేఱయి తాను వెండియుఁ గాశీనగరమునకుఁ గాపురముండఁ బోయెను.

## చతుర్థప్రకరణము.



అట్లు కాశీపుర నివాసియై రామమోహనుఁడు నానా భాషలు నేర్చుకొనుట కారంభించెను. వానితోఁబాటు ఆయా జాతుల మతగ్రంథములను ధర్మశాస్త్రములనుఁగూడ బఠించి వానియందుండు సత్యమును బవిత్రమునైన ధర్మముయొక్క యాథార్థ్యమంతయు సంగ్రహముచేయ మొదలిడెను. జ్ఞానార్జనమునం దాయనకుఁ గల ప్రిబలాసక్తియు మూలధర్మముయొక్క సత్యములను, తత్త్వములను అన్వేషించుటయు నాయనకు నిత్యదైనికకృత్యము లాయెను. ఆయన ఆహారవిహారములనుగూడ మఱచిపోయి రేయింబవళ్లు గ్రంథావలోకమున నిమగ్నులై యుండఁదొడఁగిరి. పఠనాసక్తియు అధ్యవసాయమును నిరంతరపరిశ్రమమును ఏకాగ్రతయు మొదలగునవన్నియుఁ గథలవలెఁ బ్రిఖ్యాతము లగుచుండెను.

బాల్యమునుండియు మనుజుని కెట్టిస్వభావ ముండునో వయస్సువచ్చినపుడుగూడ ఆతని కట్టి స్వభావమే యుండును. రామమోహనుఁడు చిన్ననాఁటనుండియు నాటపాటలతోడను, వ్యర్థసంభాషణములతోడనుకాలక్షేపముచేయక విద్యయందును, జ్ఞానార్జనమునందును మాత్రమే మనస్సునుంచెను. అందుచే వయస్సుతోఁబాటు ఆతనిస్వభావముగూడ నట్లే పరిణమించెను. ఆయనకుఁ జదువుకొనుటయందు స్పృహ, పరిశ్రమచేయుట

యందు శక్తి, యేకాంతస్థితియందాసక్తి అధ్యవసాయము మొదలగున వన్నియు నభివృద్ధిచెందెను. లోకు లాశ్చర్యమొందిరి. మనుజుఁ డిట్లు కాఁగలఁడా యని నివ్వెరపడిరి.

బృహత్తరమైన సప్తకాండ రామాయణమును రామమోహనుఁ డొకదినమునందే పఠించుట పూర్తిచేసెను. అదియైనను కథవలెఁ జదువుటగాక ప్రతిశ్లోకార్థము నెఱింగి, భావమును గ్రహించి, భాషయొక్క గుణదోషములను, సౌందర్యమును సంపూర్ణముగానాంతర్యమునకుఁ దెచ్చుకొనుచు మఱియుఁ జదివెను. ఉదయమునుండియే ద్వారము బంధించుకొని రామాయణము చదువ నారంభించెను. ఒక్కనిమిషమైన నటునిటు కదలలేదు. ఆహార నిద్రా విశ్రాంతులు మఱచిపోయెను.

ఆ పుస్తకము సాంతముచేసి బయటికి వచ్చునప్పటికి సాయంకాల మాయెను. విద్యార్జనయం దిట్టినిరంతరయత్నము లేకున్న నెవ్వరైన వారివలె భువనవిఖ్యాతపండితులు కాఁగలరా? ఈవిధమున సారస్వత సాధనముచేయువారు జయమాలతో భూషితులు గాకుందురా?

ఆయనయొక్క పాండిత్యప్రభాపుంజములు దేశవిదేశముల కంట వ్యాపించెను. అపుడు స్వదేశమునందును ఆయన మాట కెదురాడ నెవరికి సులభము గాకుండెను. విశేషముగ నాయన ధర్మసంస్థాపమును, సంఘసంస్కారమును జేయ సమకట్టి తిరుగుచున్నపుడాయనను శాస్త్రవాదములనోడించి యరిక

ట్రవలయు నని హిందూసంఘమునం దనేకుల కిచ్ఛగలిగెను. పెద్ద పెద్దమహామహోపాధ్యాయపండితు లేతెంచి ఆయనతో శాస్త్ర వాదములను జేయ మొదలిడిరి. కాని అందఱును రామమోహనుని విద్యాబుద్ధులయెదుటను, పాండిత్యమునెదుటను తామే బాలకులమని గ్రహించిరి. ఏవరును రామమోహను నోడింపలేక పోయిరి. కాని, రామమోహానుని విజయమును దమ రెలుఁగెత్తి నుడువ నీర్ష్యాళువులై లోలోనమాత్ర మంగీకరించినవారైరి.

ఈవిధముగ నొకరితరువాత నొకరు వచ్చుచుఁ బెక్కండ్రు పండితులు వాదప్రతివాదము లొనర్చుచుఁ బోవుచుండెడివారు. ఒకసారి యొకపండితుఁడు వచ్చి తంత్రశాస్త్రములను గుఱించి రామమోహానునితో తర్కించుటకును, నాలోచించుటకును గోరిరి. రామమోహానుఁడు శాస్త్రగ్రంథము లన్నిటిని జదివెను; కాని తంత్రములను జదివి యుండలేదు—అందుచేఁ దంత్రములనుగుఱించి యేమియు నప్పుడు ప్రసంగమునకు దిగక యూరకుండెను.

పండితుఁడు వచ్చి తంత్రములనుగుఱించి తర్కింప నాలోచింపఁగోరినపుడు అతఁడు వెనుదీయక యీ నూతనవిషయమును జదివి, మఱియుఁ దర్కముచేయు టుచితమని సంకల్పించుకొని, యాపండితు నానాఁటికిఁ బోయి, మఱునాఁడు రమ్మని చెప్పెను. ఆదినముననే రాజా రాధాకాంతదేవబహదూర్ వారిగృహము

నుండి, ఉత్కృష్టమగు నొక తంత్రగ్రంథమును దెప్పించుకొనెను.

ఆయనకుఁగల యాశ్చర్యకరమైన మనోబలముచేతను, ఆత్మనిర్భరశక్తిచేతను, ఒకదినమందే యజ్ఞాత మగు నాతంత్రిగ్రింథమును సంపూర్ణముగఁ బఠించి తత్సారమును గ్రహించెను. మఱునాఁ డాపండితుఁడు వచ్చినవెంటనే యాయనతో యథావిధిగా శాస్త్రవాదముసేయ నారంభించెను. అతికఠినసూత్రాతి సూక్ష్మములైన తత్త్వముల నన్నిటిని అతి చమత్కారముగ నాలోచించుచు వాద మొనర్చుటఁ జూచి తంత్రశాస్త్రమునందు రామమోహానునకుఁ గల యసాధారణప్రిజ్ఞకు నివ్వెరపడి యా పండితుఁడు పరాజితుఁడై వెడలిపోయెను.

క్రిమముగా నిట్టివిషయములలో విద్యాబుద్ధిపాండిత్యము లయం దందఱిని మించినకొలఁదియు నాయన మనస్సునందు ధర్మముయొక్కయు సంఘముయొక్కయు దుష్కృత్యములను రూపుమాపవలయు నని ప్రబ లేచ్ఛజనించెను. కావున ప్రితి చోటను, ప్రతివానితోడను శాస్త్రవాదములు గావించి సంఘ ధర్మములయొక్క దోషముల నెత్తి చూపుచుండెను.

దేశమున యుగయుగాంతరములనుండియుఁ బరుపాను క్రిమముగా నెముకల నంటియున్న మూఢాచారములను హఠాత్తుగా రూపుమాపుట సులభమైనవిషయముగాదు. తాతము త్తాత లేదిచేసిరో, యేమార్గమున నడచిరో, వారిసంతతివారు నదియే చేయఁగోరుదురు; ఆమార్గముననే నడువ నిచ్ఛగింతురు.

ఎవరేని నెప్పుడైన వానియందు దోషము లెన్నుదురేని మనుజుల
మనస్సులకుఁ గంటకముగా నుండును. పూర్వపురుషులను నిం
దించుచున్నారనియు, నవమానించుచున్నారనియుఁ దలంచి యం
దఱు నాతనిపైఁ గోపింతురు. మఱియు నాతని నణఁచివేయఁ
జూతురు. రామమోహానుని కట్టిస్థితియే సంభవించెను.

ప్రతిమాపూజకు విరుద్ధముగా దోషములను జూపి వా
దింప నారంభించినంతనే లోకు లాతని నాస్తికుఁడని యసహ్యిం
చుకొనిరి; మనుజుని దేవతగా నెంచి పూజించుట నిషేధించినపుడు
లోకు లాతనిని "విధర్మి"యనియు; 'మ్లేచ్ఛుఁ'డనియు దూర
ముగఁ దఱిమివేయఁజూచిరి; దానిపై సహగమన నివారణకై
యుపన్యాసము లారంభించినపు డాతఁడు సంఘమునకు మహా
పకారి యగుశత్రు వనియెంచి ప్రజ లాతని నణఁచివేయఁజూచిరి.

క్రమముగ దేశమునం దందఱును రామమోహానుని ధర్మ
సమాజసంస్కారముల ప్రయత్నములయెడల విరక్తులై ఆయనకు
ఘోరతర ప్రతిబంధకములను, విఘాతములను గూర్చుచుండిరి;
ప్రతిపక్షు లెట్టి యత్నములను గావించుచుండినను, రామ
మోహానుఁడు గ్రంథములపై గ్రంథములు వ్రాసి నిజవ్యయము
తో నచ్చొత్తించి మతసత్యములను బ్రకటనచేయనారం
భించెను.

ఈ ప్రకటనాదులచే దేశీయు లాతనికి మఱింత శత్రువు
లైరి. ఆతనిని జంపిననేగాని కోపము దీఱునంత యుద్రేకపూరితు

త్తైరి. అయినను రామమోహనుఁడు ఒక్కయెడనైనను వెను కను వేయలేదు; భీతిలలేదు; నిరాశఁజెందలేదు. భగవానునిపై దృఢవిశ్వాసమును ఆత్మశక్తిపై నేకాంతనిర్భరతయుఁ గలిగి యుండెను. ఆయనయొక్క సత్యోన్నతమార్గముల కడ్డువచ్చు వా రెవరు?

ఈశ్వరునియందు విశ్వాసముంచి ఆత్మశక్తిపై సంపూర్ణ ముగ నాధారపడి నడువఁగలవారికి భగవానుఁడు మాటిమాటి కిని సహాయపడుచుండునుగదా! రామమోహానున కట్లె జరిగి నది. దేశీయు లాతని శత్రువులై ఆతనిని నిందల పాలుచేసినకొ లఁదిని విదేశీయపండితులును పెద్దపెద్ద రాజపురుషులును, బండి తవరేణ్యులగు దొరలు నాతని యద్భుతశక్తి కాశ్చర్యపడి మె చ్చుకొని యాంతరంగిక స్నేహితులు కాఁజొచ్చిరి. ఆయన యద్వితీయప్రతిభ నాదరించి కొనియాడి గౌరవింప నారంభించిరి. దీనివలన రామమోహానుని మనోబలము దశగుణము లధిక మయ్యెను.

---

## పంచమ ప్రకరణము.

1803 వ సంవత్సరములో రామమోహానుని తండ్రి రమాకాంతరాయలు మరణించిరి. రామమోహానుఁడు పంఘ

చ్యుతుఁడును, గృహదూరుఁడునయినను సర్వదా మిక్కిలి పితృ భక్తుఁడయియే యుండెను. స్వతంత్రుఁడై యుండియుఁ బితృ సమ్మానరక్షణార్థమై సంపూర్ణముగఁ దన యిచ్ఛానుసారముగాఁ గర్తవ్యమార్గమున నడువలేకపోయెను. ఇన్నాళ్ల కాయన సకల బంధనములును బరిష్కృత స్వాధీనతఁ బడయఁ గలిగెను. మాధ్యా హ్నిక సూర్యునివలెఁ బ్రఖరప్రభావముతో విపులాధ్యవసాయ ముతో సర్వవిధములయిన సంఘధర్మసంస్కారములలోను నిమ గ్నుఁడాయెను. నలువైపుల నుపన్యాసము లిచ్చుట కారంభిం చెను. నానావిధములగు పుస్తకములను వ్రాసి బహుభాషలలోఁ బ్రకటించి పంచిపెట్ట నారంభించెను. అందుచే ఆయనయొక్క అభిప్రాయములు హెచ్చుగాఁ బ్రజలకు బోధపడఁజొచ్చెను. దానివలన నాయనకు మఱింతబాధ యెక్కువాయెను. ఇంత వఱకుఁ గొలఁదిమందియైనను ఆత్మీయాంతరంగిక బంధుమిత్రు లుండెడివారు. ఇపుడు వారుగూడ విపక్షభావ మవలంబించిరి. ఆయన చేయఁబోవు ప్రతికార్యమునకును ఆటంకములు కలుగఁ జేయఁజొచ్చిరి.

ఆయన తల్లిగారుసైతము పుత్రునికి విరోధురాలయ్యెను. రామమోహనుఁడు పితృభక్తుఁడై యున్నటులనే లోలోపలఁ దల్లినిసైతము మహాదేవిగఁ దలంచి నిరంతరమును శ్రద్ధాభక్తు లతోఁ బూజించువాఁడు. ఇట్టిస్థితిలోఁ దనతల్లియు విరోధురా లయినపు డాతఁడు మిగుల విలపించెను. వ్యాకులతచే నతని

ప్రాణములు తల్లడిల్లెను. ఏమిచేయవలసినదియుఁ దోఁచక యతఁడు నలువైపుల నంధకారమునే చూచుచుండెను. కాని విశేషదినము లతని కీయశాంతికరమగు నవస్థయందుండ నవసరము లేకపోయెను. భగవానునిపై నాయనకుఁగల విశ్వాసము వలనను,ఆత్మశక్తి వలనను ఆయన శీఘ్రముగా శాంతిని బడసెను. ఆయన తన మాతృదేవియొక్క దుర్భ్రమపూర్ణాజ్ఞానాంధకారము శీఘ్రముగ నంతరించుననియు, మరలఁ దన కామె స్నేహాపూర్ణ క్రోడమునందు స్థానము దొరకుననియుఁ దలంచెను. అపుడాయన పోయిన తన మనోబలమును దిరిగి పొందెను.నవీనోద్యమముతో మరలఁ దన కర్తవ్యమార్గమునం దగ్రిసరుఁడు కాఁజొచ్చెను.

తండ్రి మరణించిన వెనుక రామమోహనుఁడు పైతృకమగు చరస్థిరరూపక సంపత్తియంతయు "విధర్మి" యగు పుత్త్రుఁడై యుండియు నాక్రమించుకొనునేమో యనుభయముతో నాత్మీయస్వజనులు భీతిఁజెందిరి.మఱియు రామమోహానుని మాతచేత నతనిపై హైకోర్టునందు వ్యాజ్యము వేయించిరి. పుత్రుఁడు విధర్మిగావునఁ బైతృకసంపత్తి యాతని కేమియు ముట్టకూడదని యతనితల్లి వాదింపఁజొచ్చెను. చిరస్నేహమయియు స్వధర్మైకాయత్తయు నగు రామమోహానుని జనని తారిణీదేవి తనహృదయవేదన హృదయమునం దణఁచుకొని, కన్నీటిధారలు దుడిచివైచుకొని, పుత్త్రునిపైఁగల మమకార

మును విసర్జించి, శత్రుత్వమును వృద్ధిచేసి సాధింప బద్ధకంకణ యయ్యెను.

మాతాపుత్రుల వ్యాజ్య మిదియొక విచిత్రవ్యాపార మయ్యెను. కొన్నాళ్లీవ్యాజ్యము జరిగెను. ప్రజ లావింతచర్య జూచుటకై న్యాయస్థానముచుట్టును మూఁగుచుండెడివారు. పదిమందియుఁ బదిమాటలు ననుకొనఁజొచ్చిరి. రామమోహ నుని హృదయమునం దతివేదన కలిగెను. ఆయన కేమి చేయ వలెనో తోఁచకుండెను. ప్రథమమున లోలోపలఁ బుట్టిన యస హ్యతచే నీవ్యాజ్యమునందుఁ దాను దిగరాదని తలంచెను; పైతృకసంపత్తి వలనఁ దనకుఁ బ్రయోజనములేదనుకొనెను. కాని తా నీవ్యాజ్యమునం దోడిపోయినయెడలఁ దన గౌరవమునకు భంగము రావచ్చుననియుఁ దనమాటపై నింకనెవరును శ్రద్ధ జూపకపోవచ్చుననియును, దన యిష్టసిద్ధిమార్గమునం దాటంక ములు కలుగవచ్చుననియు సతఁడు దలంచెను.

సంఘసంస్కారముఁ జేయవలెనన్నను నూతనాదర్శములు నెలకొల్పవలెనన్నను బదిమందిని దనమార్గమునఁ బ్రవర్తింపఁ జేయవలెనన్నను మున్ముందు తన ఆత్మగౌరవమును నిలుపుకొన వలెను; తన్ను నున్నతపఱుచుకొనవలెను; అందఱికంటె నుత్కృష్ట స్థానమును బొందియుండవలెను. దేనికి వెఱచినను, వెనుదీసినను గార్యము జరుగనేరదు. కాఁబట్టి యాయన వ్యాజ్యములోఁ దిగవలసివచ్చెను. తుద కాన్యాయస్థానమునం దాయన తల్లియే

యోడిపోయెను. ఆయనకే జయముకలిగెను. ఆయన తనతండ్రి గారి యాస్తికంతకును నధికారియయ్యెను. కాని యామహాపు నుఁడు దాని ననుభవించుటకు జన్మించలేదు. ఏమహావ్రతమున కై, యేసాధనసిద్ధి నిమిత్తమై జన్మించెనో దానియందే నిమగ్న మైన యాతని చిత్తమునకుఁ బైతృకసంపత్తియందును, భోగ విలాసములందును నేమాత్రము తృప్తిగాని గోరికగాని లేకుం డెను. ఆయన సంసారమునం దొక మంగళసాధనకై యేతెంచి నాఁడు. ఏకనిష్ఠాపరుఁడగు యోగివలె సకలము నుపేక్షించి నిజకర్తవ్యసిద్ధిని సాధించి వెళ్లఁదలంచెను. ఇదియే యాతని యున్నతాభిలాష. అట్టివాని కర్థసంపదలతోడను విషయవైభవ ములతోడను నేమిపని?

కాఁబట్టి యతఁడు న్యాయస్థానమునఁ దనకు సంక్రమించిన పైతృకసంపద నెంతమాత్రమును స్వీకరింపలేదు. భక్తితో నంతయుఁ దనజననియొక్క చరణములయొద్దనుంచి ప్రణామములు సమర్పించెను. అపుడందఱు నాతనిమహత్తును గ్రహించి వేనోళ్ళఁ బొగడనారంభించిరి.

సంసారమునందు మాన్యగణ్యవ్యక్తిగాకున్నను ఉన్నత రాజపదవియందుఁ బ్రతిష్ఠితుఁడు గాకున్నను సహజముగా లోకులు గౌరవించువారుగారు. లోకులు వశీభూతులుగానియెడల ధర్మ సంస్కారముగాని సంఘసంస్కారముగాని చేయ వీలులేదని యతఁడు గ్రహించెను. కేవలము విద్యాధికతయు, బుద్ధివైభవ

మును, పాండిత్యము నున్నంతమాత్రముననే యాకార్యములు నెరవేరునవికావు. వానితోఁబాటు ఉన్నతపదవులును గౌరవము లునుగూడ నుండుట మఱింత యవసరము. ఇట్లు తలంచి ఆయన యేదో యొక యున్నతరాజకార్యమునఁ బ్రవేశింప నిశ్చయించుకొనెను.

అపుడు 'డిగ్బి' దొరగారు రంగ్‌పూరు కలెక్టరుగా నుండెను. రామమోహానునికి గొప్పగొప్పదొరలతో నెక్కువ పరిచయ ముండెడిది. వార లాయనను మిక్కిలి యాదరించి భక్తిశ్రద్ధలను జూపుచుండువారు. డిగ్బి దొరగారు కూడ నాయనకుఁ బరిచితులైరి.

రామమోహానుఁ డుద్యోగమునిమిత్తము డిగ్బిదొరగారికి దరఖాస్తు పంపెను. ఉద్యోగము స్వీకరించినను పైవారియొద్దహీనత్వము నొప్పుకొనననియు, నందఱితోఁబాటు సమానముగఁ గూర్చుండుటకుఁ గుర్చీ నీయవలెననియు, నెవరి యెదుటను సలాము జేసి మెడవాల్చి నిలువననియు ఆదరఖాస్తునందు వ్రాసి పంపెను.

ఈదరఖాస్తు చదువుకొని దొరగా రాశ్చర్యపడిరి. రామ మోహానుని వయ స్సప్పు డిరువదినాలుగువత్సరములు. ఆయువకుని నిర్భీకతను తేజస్వితను ఆత్మగౌరవజ్ఞానమునుజూచి యత్యంత సంతుష్టిఁ జెంది యాదొరగారు వెంటనే యాయనకొక యున్నతోద్యోగము నిచ్చెను.

రామమోహనుఁ డిట్లు రాజోద్యోగమునం బ్రవేశించి తన విద్యాబుద్ధులును పాండిత్యమును సత్యనిష్ఠయు మనోబలమును సత్సహవాసమును మొదలగున వన్నియు నద్భుతముగ వినియోగింపఁ బ్రారంభించెను. వాని సాహాయ్యమున నాతఁడు తన కార్యముల నతినిపుణతతోడను సమర్థతతోడను జేయఁ జొచ్చెను. ఎంత యనుభవముగల రాజకార్యపరిచారులైనను అట్లు చేయఁజాలకుండిరి. కావున సర్కారువారు శీఘ్రముగ నాయనగుణములను గ్రహించి, యనతికాలముననే పదోన్నతి కేర్పాటు చేయఁజొచ్చిరి.

ఆయనయొక్క యాదర్శజీవితముచే దొరతనమువారి యుద్యోగులలో సేవాకాఠిన్యములును నింద్యములగు లంచములను దీసికొను నలవాటులు నడుగంటెను. ప్రజలు ధర్మసంగతమైన న్యాయ విచారమునుబొంది పరమసంతుష్టులై నలువైపుల నుండియుఁ బీడింపఁబడకయే అతిసులభముగా దొరతనమువారి కాదాయ మెక్కువయయ్యెను. కావున వా రాయన సుగుణములకుఁ బురస్కారత నిచ్చుచుండిరి. ఇట్లాయన క్రమముగాఁ బదోన్నతిఁబొంది తుదకు దివాను పదవికిఁగూడ వచ్చెను. ఇంతకంటె నున్నత సన్మానయుక్త పదవి యాదినములలో మఱియొకటి లేదు.

డిగ్బీ దొరగా రపు డాయనకు నిష్కపట పరమస్నేహితుఁడై యుండెను. ఒక్క నిమిషమైన నాయనను వదలియుండఁడు

వాఁడుకాఁడు. అన్నివేళలందు నన్నివిషయములలోను నాయన సలహాపైఁ గార్యము లొనర్చుచుండెడువాఁడు. ఆయనకు రామమోహానునిపై నధికభక్తి గలుగుటచే నాయనవ్రాసిన యనేక పుస్తకములకుఁ బీఠికలు వ్రాసియిచ్చి వాని గౌరవమును వృద్ధి పఱిచెను. ఇట్టి సమయమున రామమోహానుఁ డనేకగ్రంథములు లిఖించి యుండెను. మఱియు రెం డుపనిషద్గ్రంథముల నింగ్లీషు భాషలోని కనువదించెను.

గవర్నమెంటు దివానుపదవినొంది రామమోహానుఁడు రామగడ, భాగల్పూరు, రంగపూరు మొదలగు స్థానములలో రాజకార్యార్థమై బదిలీచేయఁబడి తిరుగుచుండెను. ప్రతిస్థానమందును అనాయాసపరిశ్రమతో రాజసేవఁజేయుచు దానితోఁ బాటు దేశముయొక్కయు ప్రజలయొక్కయు సేవగూడఁజేయుటకు మొదలిడెను. ప్రతిస్థానమునందును దానుండు కాలమున ఆయన యొక ధర్మసభను స్థాపించి లోకుల గ్రుడ్డినమ్మకములను దూరముచేయఁ బ్రయత్నము చేయుచుండెను. అనేకు లాయనకు వ్యతిరేకముగ నున్నను ఆయన యొక యున్నతరాజపదవియందుండుటచేతను, ధర్మసభలను స్థాపించుటచేతను, పండితులును, జ్ఞానులు నైనవా రొకరిద్దరువచ్చి ఆయనపక్షము నభివృద్ధిచేయుచుండిరి.

ఇట్లు పదుమూఁడువత్సరములవఱకు నాయన రాజోద్యోగకార్యము నెరవేర్చి తన నలుబదిరెండవయేట దానిని

ద్యజించి, దేశముయొక్కయుఁ బ్రజలయొక్కయు, సంఘముయొక్కయు, ధర్మముయొక్కయు సేవకై మనోవాక్కాయకర్మల నర్పించి తన కర్తవ్యములను సాగింపఁ గలకత్తాపురమును జేరెను.

బ్రహ్మజ్ఞానముయొక్క ప్రయాలోకము బాల్యవయస్సునం దాతనిహృదయమునఁ బ్రప్రథమమున వెలిఁగెనో, ఇపుడా యాలోకసహాయమున దేశమునం దజ్ఞానాంధకారమును దూరముచేసి సత్యధర్మముయొక్క విమలజ్యోతిచే హిందూసంఘము నుజ్జ్వలింపఁజేయుటకు ఆయన తనజీవితము నర్పించెను. కర్మవీరుఁడగు రామమోహనుఁ డీసారి కార్యకర్మక్షేత్రమునందుఁ బ్రవేశించెను.

అట్లాయన కార్యవీరుఁడై దేశోద్ధరణ రణరంగమున నిఖిల వేద వేదాంత శాస్త్ర నిగూఢసత్య ధర్మాయుధుఁడై యుద్ధమునకు దిగినవెంటనే నలువైపులను మహాందోళన ముద్భవిల్లెను. పూర్వమువలెనే యాయనకు శత్రువుల కొఱంత లేకుండెను. మిత్రు లెవరు లేకున్నను ఆయన యేమాత్రమును జంకలేదు. ఈసారి యాశత్రువులందఱు నేకమై నలువైపులనుండియు నాక్రమించి యాయనను బీడించుట కారంభించిరి. అయినను ఆయన మహావీరుఁ డగుభీష్మునివలె నిర్భీకుఁడై యచంచల ధైర్యస్థైర్యములతోఁ దన నిర్దిష్ట భగవ ద్బోధిత మార్గముననే నడుచుచుండెను.

అన్ని ధర్మములకును మూలమొక్కటియే యను సత్యమును బోధించి ప్రజల మనస్సునుండి సంకుచితాభిమతాంధకారమును భ్రాంతియు మొదలగువానిని దూరముచేసి యాయన దేశీయుల నెంత యుదారులుగను, ధార్మికులుగను, ఉన్నతశీలురుగను జేయఁ బ్రయత్నించెనో శత్రువులంత తీవ్రముగ నాయనకాటంకములను గలిగింపనారంభించిరి. ఆయన యెన్నిసభాసమితులను స్థాపించి, గ్రంథములను లిఖించి, తన ఆదర్శములను జూపి యందఱిమంచికై యెంతప్రయత్నము చేయుచుండెనో ప్రజలంత క్రోధోద్దీపితు లగుచుండిరి.

"రామజయ బటబ్యాల్" అను నొక వ్యక్తి దాదాపుగా నైదువేలప్రజల నొకచోట సమావేశపఱిచి యాయనకు విరుద్ధముగ నొక గొప్ప దళము నేర్పఱిచి ప్రత్యహము నాయన యింటిముందు గోమయమును, ఎముకలను, అశుద్ధమును జల్లుచు ముండ్లకంపలను బడవేయుచు నానావిధముల బాధింపఁదొడఁగెను. తుద కతఁ డాయన నేమియుఁ జేయలేక కోర్టునందు భయంకరమగు మిథ్యాభియోగము నొకదానిని లేవనెత్తి యాయనను జిరకాలము నష్టపఱుచుటకు నవమానించుటకును బ్రయత్నించెను.

"సత్యమేవ జయతి" యనునట్లు సత్య మెప్పుడును జయమే పొందును. ధర్మ మెల్లపుడును బలవత్తరమైనదే. సదుద్దేశము, నిష్కామపరహితవ్రతము చిరకాలము జయమునుగల

విరోధులై తనరాతచుండుదురు. కావున శత్రుప్రయత్నము లెవ్వియు రామమోహనున కేమాత్రమును నష్టమును గలుగఁజేయలేక పోయెను. ధర్మబలముచేతను, సత్యబలముచేతను, ఆత్మత్యాగబలముచేతను, ఆయన వాని నన్నిటి ననాయాసముగ దాఁటఁ గలిగెను.

---

## షష్ఠ ప్రకరణము.



రామమోహనుఁడు కలకత్తాలో మాణిక్‌తల సర్క్యులరురోడ్డునందు నిర్మించిన గృహమునందు నివసించుచుండెను. ఆసమయమున నాతఁడు తన గృహమునందే యాత్మీయసభ యను పేరుతో నొకసభను స్థాపించెను. ఆ సభయందుఁ బ్రతి దినమును వేదపఠనమును, పూర్ణబ్రహ్మోపాసనమును, భగవానుని స్తుతిగానమును జరుగుచుండెను. రామమోహనుఁడు స్వయముగ నీశ్వరతత్త్వమునుగూర్చి పరమభక్తిపూర్ణముగఁ గొన్నిపాటలు రచించి పాడుట కారంభించెను. ఆపాటలే బ్రహ్మగీతములుగాఁ బరిణమించినవి.

రామమోహనునివంటి మహాశక్తిశాలియు, మహాపండితుఁడును, బరమగౌరవార్హుఁడును, ఉన్నతరాజ సమ్మానయుక్త ధనికుఁడు నగు వ్యక్తి కలకత్తావంటిరాజధాని నడుమ నట్టిధర్మ

సభను స్థాపించి, పవిత్రమగు హిందూధర్మముయొక్క పరిశుద్ధ సత్యమును బోధించుటకు వేదాంతానుసారముగ ధర్మప్రచారము చేయనారంభించిన వెంటనే చిరకాలాభ్యస్తదురాచారాబద్ధమైయున్న మూఢహిందూసంఘము నిశ్చింతగ నుండఁజాలక పోయెను. వారలుకూడ నాయనయొక్క యభిప్రాయములను ఖండించి, సంఘముయొక్క పూర్వాచారమును నిలుపుకొనుటకును, నూతనముగాఁ బ్రచారమునకు వచ్చుచున్న రామమోహనుని ధర్మముయొక్క మూలమును బెకలివేయుటకును వేఱుగా నొకమహాసభను నెలకొల్పిరి. రాజా రాధాకాంతదేవబహద్దూరుగారాసభకు సభాపతులుగా నెన్నుకొనఁబడియుండిరి. దేశదేశములనుండి గొప్పగొప్పపండితులను రప్పించి వారిచే శాస్త్రవాదములయందు రామమోహను నోడింపఁజేసి యాయనను దమయధీనము జేసికొనవలయు నని వారు ప్రయత్నించిరి. సుబ్రహ్మణ్యశాస్త్రి మొదలగు నప్పటి దేశవిఖ్యాతులగు పండితులు రామమోహనునిశాస్త్రవాదమునం దోడించుటకు నడుములుబిగించిరి.

ఉభయపక్షములకు నతిభయంకర శాస్త్రవాదములును, మహాతర్కయుద్ధములును కలిగెను. ఒక వైపున రామమోహనుఁ డొక్కఁడే; మఱొక వైపున సమస్తభారతవర్షమునందును పేరు పొందిన మహాపండితమండలి! ఇట్లయినను ఆయన నెవ్వరు నోడింపలేకపోయిరి—తుద కాయనకే జయము కలిగెను. ఆశుభసమయమునుండియే బ్రాహ్మధర్మ విజయపతాకము కలకత్తా

పురమునందుఁ బ్రఖ్యాతమై నెలకొనఁజొచ్చెను.

ఈవిధముగా విజయమొందినవెనుక నప్పటి దేశమాన్యులును, దేశవరేణ్యులును, విద్వాంసులును రామమోహనుని ధర్మమతముయొక్క సత్యతత్త్వమును గ్రహించి మూఢత్వమును విడిచి, వాస్తవహిందూధర్మరక్షణార్థమై యాయనపక్షమునఁ జేరిరి. వీరిలో ద్వారకానాథ ఠాకూరు, గోపీమోహన ఠాకూరు, ప్రసన్నకుమారఠాకూరు, అన్నదా ప్రసాదబంధోపాధ్యాయు, వ్రజమోహన ముజుందారు, నందకిశోరబోసు కాళీనాథమున్షీ, భైరవచంద్రదత్తు, కాళీనాథమల్లిక్, తారాచంద్ర చక్రవర్తి మొదలయినవారు ప్రధానులు.

వీరందఱును గొప్పవిద్వాంసులును, సద్వంశజులును, ధనికులును, మాన్యులును, పూజనీయవ్యక్తులు నై యున్నవారు. అందఱును దేశమునకును సంఘమునకును నేతలు. కావున రామమోహనుని నూతనధర్మసంస్థయొక్క పునాది దృఢతమమయ్యెను. అపు డాయన మహానందమునందు నుత్సాహమునందును మునిఁగి ప్రథమమున నొక యద్దెయింటియందును, అనంతరము చిత్పూరురోడ్డున నిర్మితమైయున్న ప్రత్యేకగృహమునందును బ్రాహ్మధర్మోపాసనాసమాజమును స్థాపించెను. ఇదియే 'ఆది బ్రాహ్మసమాజము' !

రామమోహనుఁడు రంగపురమం దున్నపుడు హరిహరానందస్వామి యను నొక పరమజ్ఞానియగు సన్యాసితో నాయ

నకు మిక్కిలి సన్నిహితస్నేహ మేర్పడెను. ఆయన వచ్చి యీ యాదిబ్రహ్మసమాజమునందుఁ జేరెను. అప్పు డాయన తన భ్రాతయుఁ బండితశ్రేష్ఠుఁడును అయిన 'రామచంద్ర విద్యావాగీశ' మహాశయుని రప్పించి యీబ్రాహ్మసమాజమున నాచార్యపదవియందు నియమించెను. ఈవిద్యావాగీశమహాశయుఁడే ఆదిబ్రాహ్మసమాజమునకు మొట్టమొదటి యాచార్యుఁడు.

ఇట్లొనర్చి రామమోహనుఁడు నిశ్చింతగా నూరకుండక విగ్రహారాధనమును దేశమునుండి తొలఁగించి వేయుటకును, అందఱును నవధర్మమును స్వీకరించి యేకమాత్ర పరమేశ్వరారాధనముచేయుటకును, ఆవశ్యకములగు నేర్పాటులను జేయుచు నలువైపులను సభాసమితులను నెలకొల్పఁదొడఁగెను. వానితోపాటు ఈదేశీయు లాంగ్లభాష నేర్చుకొనుట కనుకూలములగు సంస్థలను, నలువైపుల నుత్తమజ్ఞానవ్యాప్తి కనువగు నేర్పాటులను, దేశాభ్యుదయ నిరోధకములగు జాతిమతతారతమ్యములను దొలఁగించు సంస్థలను దన యావచ్ఛక్తిని వినియోగించి నిలుపనారంభించెను. దొర లందఱును రామమోహనుని గౌరవించుచుండిరి. ఆయనయొక్క మహత్తును, పరహితాచరణవ్రతమును జూచి యనేకులు తమంతటఁదాము స్వయముగా వచ్చి యాయనతో నేకీభవించుచుండిరి. దేశమునందు మిక్కిలి పేరుపొందిన 'డేవిడ్ హేర్' దొరగారు ఇట్టిసభయం దొకసారి యాహ్వానింపఁబడకయే వచ్చికూర్చుండెను. అప్పటినుండియు నాయన

కును రామమోహనునకును ఆంతరంగికబంధుత్వ మేర్పడెను.

సాధారణముగా మనుజుఁడు తనజీవితమునందొక్క మహా కార్యమునైనను దుదముట్ట నెరవేర్చి వెళ్లుట యరుదు. కాని రామమోహనుఁ డొక్కసారియే బహుకార్యనిర్వహణమునుఁ జేయుచేసికొనెను. దేశీయులు చక్కఁగాఁ జదువుసంధ్యలు నేర్చుకొని యెట్లు మనుజులు కాఁగలరో, వారు తమసంఘకళంకమంతయు నెట్లు తుడిచివేయఁగలరో, ప్రాచీనకాలపు పాపభూయిష్ఠదురాచారములు (కుప్రథల) నన్నింటి నెట్లు నాశనము చేయఁగలరో, ప్రజలందఱును బెద్దపెద్దప్రభుత్వోద్యోగములను సంపాదించి సుఖముగాను, స్వేచ్ఛగాను, గౌరవముగాను, జీవయాత్ర నెట్లు నిర్వర్తించుకొనఁగలరో, కఠినధర్మతత్త్వము లన్నిటిని అతిసహజముగాను, సరళముగాను, నాబాలగోపాలము నెట్లు గ్రహింపఁగలరో, దేశీయులు స్వాధీనచిత్తముగలవారుగను, ధార్మికులుగను, ఆత్మనిగ్రహముగలవారుగను, ఉన్నతశీలురుగను ఎట్లు కాఁగలరో యట్టిప్రతివిషయముకొఱకును దన యావచ్ఛక్తిని వినియోగించి, సంతతధారగా నాయన తన జీవితమును ధారపోసెను. ఇట్టిపరహితాచరణవ్రతపరాయణుఁడును, ఇట్టినిష్కామకర్ముఁడును, ఆత్మత్యాగియు, నిట్టి పరదుఃఖనివారణశీలుండును, ఇట్టి పరసుఖైకచింతాయత్తుండును అయినసాధుపురుషుఁడు లోకమున మిగుల సత్కృత్తుగానే లభించును.

ఒకరియందు మంచి గోచరించినతోడనే వారియెడల

హింసాపరాయణులగుట యనేకులకు స్వభావము. ఆత్మోద్ధారము చేయుచున్నాఁ డనువిషయము లోలోపల గ్రహించినను ఆవిషయమును బైకి వెల్లడింపక యాతనిని నిందించుచుందురు. రామమోహనుఁడు సహస్రవిధబాధా విఘ్నశత్రుత్వములను దాఁటి క్రమముగాఁ దనకర్తవ్యధర్మములను నెరవేర్చుకొని పోవుచున్నపుడును, ఆయన ప్రభావము లోకసమాజమునందాధిపత్యము చేయుచున్నపుడును, కొందఱు కొంద ఱాతనిని 'విధర్మి' యనియు 'నాస్తికుఁడ'నియు, 'సనాతనధర్మప్రవర్తకుఁడ'నియు నానావిధముల నిందింపసాగిరి. సనాతనపవిత్రహిందూధర్మముల నుద్ధరించి, యుపనిషద్ధర్మమును బోధించి, ఋషిప్రోక్తవాక్యముల వినిపించి కుసంస్కారములను దొలఁగించుటకును, దేశస్థుల నాపవిత్రధర్మమార్గమున నడపించి సంసారమందుఁ బుణ్యమును బ్రతిష్ఠించుటకును, జిన్నపెద్దలందఱును ఆధర్మముయొక్క గూఢమర్మమును గుర్తెఱుంగుటకును, ఉపాసనయొక్క సహజోపాయమును బోధించి ప్రజలకును సంఘమునకును మంగళములనే సమకూర్చుటకును, రామమోహనుఁ డనేకవిధములఁ బ్రయత్నము చేయ సమకట్టెను.

ఈ యుద్దేశము సిద్ధించుటకై, రామమోహనుఁడు వ్రాసిన పుస్తకముల నన్నియు నొకచో సమకూర్చినయెడల నొక గ్రంథాలయము కాఁగలదు. దర్శన, విజ్ఞా, నేతిహాస, సాహిత్య మత ధర్మగ్రంథములను వంగభాషయందు ముప్పదిరెండును

నాంగ్లమున ముప్పదియెనిమిదియును మొత్తము డెబ్బదిగ్రంథము లను వ్రాసెను. ఇట్టిదివస కెవరయినఁ గావింపఁగలిగిరా? సాహిత్యము, విజ్ఞానము, ఇతిహాసము, భూగోళము, దర్శనశాస్త్రము, రాజనీతి, ధర్మనీతి, సమాజనీతి, మొదలుగాఁగల యన్ని విషయములలోను ఆయన కాశ్చర్యకరమగు పరిచయముండెను. ఆయన యన్నివిషయములలోను బహువిధ రత్నయుక్తములగు గ్రంథములనువ్రాసి దేశముయొక్కయుఁ బ్రజలయొక్కయు, భాషయొక్కయు, అభివృద్ధికై యనేకవిధములఁ దోడ్పడిరి. ఇట్టి యద్భుత మేధాశక్తిసంపన్నులయిన మహానుభావు లేదేశమున నెందఱు జన్మించిరో చెప్పలేము.

కలకత్తాసమీపమునఁగల శ్రీరామపురము పాదిరీలకుఁ బ్రధానస్థానమై యుండెను. అచ్చటనుండి వారు "సమాచార చంద్రిక" యను నొకవార్తాపత్రికను బ్రచురించుచుండెడివారు. ఆపత్రికయందు రామమోహనునిగూర్చి యప్పుడప్పుడు అన్యాయవాక్యములు వెలువడుచుండెడివి, అప్పు డాయన తననామమును మాటుపఱచి 'శివప్రసాదశర్మ' యను పేరుతో 'బ్రాహ్మణపత్రిక' నొక దానిని బ్రచురించుచుండిరి. దానియందు 'సమాచారచంద్రిక' లోఁగల భ్రాంతినిందాపూరితాభిప్రాయములను ఖడించుచుండెడివారు.

అనంతరము సమాచారచంద్రిక హిందువుల దోషములను జూపి నిందించుచున్నపుడు బ్రాహ్మణపత్రికయు నట్లే

క్రైస్తవుల దోషములను జూపుట కారంభించెను. ఈవిధముగా రెండుపత్రికలకును ఎడతెగక ధర్మమునుగుఱించియు సంఘమును గుఱించియు ఘోరతర వాదప్రతివాద యుద్ధములు జరిగెను. సకల యుద్ధములందును పదిభాషలలో పాండిత్యముగల బ్రాహ్మణపత్రికయే జయించెను. అపుడు కల్పిత శివప్రసాదశర్మ రామమోహనుఁడేయని యందఱును గ్రహించిరి. అప్పటినుండియు ననేక క్రైస్తవ ధర్మప్రచారకులు రామమోహనునికి వ్యతిరేకముగా ఖడ్గహస్తులైరి. అయినను ఆయన యథార్థ వీరునివలె స్థిరచిత్తముతోఁ దనకర్తవ్యములను నెరవేర్చుకొనుచుండిరి.

ఇట్లు ధర్మతత్త్వమును సమాజతత్త్వమును శాస్త్రముల గుఱించిన దోషములను నిర్ణయించుచుఁ బత్త్రికలలో జరిగిన యుద్ధమునందు జయమొందిన రామమోహనునిపేరు ఇంగ్లాండునందుఁగూడ విఖ్యాతమాయెను. మూఢాచారపరాయణులగు హిందువులవలెనే మూఢాచారపరాయణులైన క్రైస్తవులు ననేకు లాయనకు విరోధులైరి. నిష్పక్షపాతులును యథార్థపండితులు నగు పెక్కండ్రు క్రైస్తవులును, ధర్మప్రచారకు లగు పెక్కండ్రుమఫాదిరీలును, రామమోహనుని గుణములకును, శక్తికిని ముగ్ధులై యాయనకు స్నేహితులైరి. ఆంగ్లమునఁ బేరుపొందిన వార్తాపత్రిక యగు "ఈస్టు ఇండియాగెజెట్" యొక్క సంపాదకు లిట్లు వ్రాసిరి—"ధర్మయుద్ధమునందును, ధర్మసంస్కారమునందును, సంఘసంస్కారమునందును, అసహాయశూరుఁడై

పోఁగల రామమోహానునివంటి వ్యక్తి భారతదేశమునం దింత వఱ కెచ్చటను జన్మించియుండలేదు.'' రామమోహానుని యశస్సునుగుఱించి కొన్నాళ్ళపత్త్రికయందుఁ గ్రమముగా వ్యాసములు వెలువడుచుండెను.

ఆపత్త్రికలు, అమెరికా, ఇంగ్లాండు మొదలగు దేశములకు హెచ్చుగా వెళ్ళుచుండెడివి—కావున ఆ దేశవాసులుగూడ—నేత్రములతోఁ జూడకున్నను—విని రామమోహానుని శక్తికిని గుణగణములకును విమోహితులై యాయనకు స్నేహితులైరి.

కేవల మంతియేకాక యప్పటి కలకత్తా 'బాప్టిస్టుమిషన్' అను క్రైస్తవధర్మసభకుఁ బ్రధానులైన ఆడామ్ దొరగారు రామమోహానునియొద్ద బ్రాహ్మమతదీక్ష స్వీకరించి యాయన శిష్యకోటిలో నొకరైరి.

వంగదేశచరిత్రమునం దీయితిహాస సంఘటన మపూర్వమును, అద్వితీయమును అయ్యెను.

---

## సప్తమప్రకరణము.

టిబెట్టునందున్నపుడు రామమోహానుని హృదయమున స్త్రీలపై విశేషశ్రద్ధయు భక్తియు, సమ్మానమును కలిగియుండెను. మతధర్మ సంస్కారానంతరమున ఆయన సంఘధర్మసం

స్కారమునందు దిగెను. స్త్రీల దుఃఖములను దొలఁగింప బద్ధ పరికరుం డయ్యెను. ఆసమయమున హిందువుల దుర్భ్రాంతి పూర్వకసామాజిక దురాచార మగు 'సహగమనము' ఆయన హృదయమున దారుణమగునశాంతిని గలిగించెను. ఆయన యాదురాచారమును దూరముచేయఁ దనయావచ్ఛక్తిని విని యోగించి పాటుపడఁజొచ్చెను.

భర్త యొక్క మరణముతో నిచ్ఛాపూర్వకముగాఁ దమ జీవితములను బలియియ్యఁ దలఁచిన సాధ్వీమణులమాట వేఱు! కాని యనేక ప్రదేశములలో భార్యలయిష్టములేకున్నను భర్తల శవములతో బలవంతముగఁ జితిపైఁ బడఁద్రోచి వారినిగూడ దహించుచుండెడువారు. ఈవిషయమున రామమోహనుని శరీరము కంపించెను.

ధర్మముపేరిట హిందూసంఘమునం దింత యమానుష పైశాచికహింసాయుక్తకార్య మసంశయముగ జరుగుచున్నది. ఇది నరహత్యగాక మఱొండు గాదని రామమోహనుఁడు గ్రహించెను. ఇంగ్లీషువారు, ఫ్రెంచివారు, గ్రీకులు, పోర్తుగేజ్ వారు మొదలుగాఁగల విదేశీయు లనేకులు హిందువుల యీ దురాచారములను జూచి లోలోపలఁ గంపితులై నేత్రములను మూసికొనెడివారు. ఈవిషయమును నిందించుచు నెన్నివిధముల నెన్నిగ్రంథములు వ్రాసి ప్రచురించినను నేమియు లాభములేకపో యెను.తుదకు హిందువుల ధర్మముతో సాంఘికాచారముల విరో

ధర్భావమూనినటుల ప్రజలు తలంతురనియింగ్లీషువారీవిషయ ములో జోక్యము కలుగఁ జేసికొనలేదు. అందుచే ధర్మముపేరిట నీయమాయికస్త్రీహత్యాభయంకర పైశాచికాచారము జరుగుచుండెను.

భర్తృవిహీన యగునబలను బలవంతముగఁ గాల్చి చంపుటకంటె నామెను భూమిమీఁద బ్రతుకనిచ్చిన యెడల నామె బ్రహ్మచర్యము నవలంబించి ధర్మకార్యాచరణమున మహోన్నతిని బొందఁ గలదు. ఇట్టిభయానకస్త్రీహత్యయు దేశమునుండి దూరమైపోఁగలదు. ఈయాచారము దేశమునను౦డుట ధర్మముగాదు;దీనిని రూపుమాపుటయే యుత్తమధర్మము కావున నవశ్యకర్తవ్యము. రామమోహనుఁ డీవిషయమును గుఱించి గవర్నరుగారితో హెచ్చుగా నాందోళనముసాగించెను. సహగమన మెంతహింసాకరమయినదో, యెంతయధర్మమయినదో,వివరించుచు దానిని గుఱించి మూడుగ్రంథములను రచించి యచ్చొత్తించి యప్పటి గవర్నరుజనరలుగారి భార్యయగు 'లేడీహేస్టింగ్సు'కు అంకిత మిచ్చెను. అనంతర మాగ్రంథములు దేశమునఁ బ్రచారితములయి మహాందోళనము గలిగించెను.

అంతియేగాక, ఆవిషయమై యనేకపత్రికలలో నాయనచే వ్యాసములు వ్రాయఁబడుచుండెను; పత్రిచోటను ఉపన్యాసము లీయఁబడుచుండెను. అపు డావిషయము దొరతనమువారి దృష్టి

నాకర్షించెను. గవర్నరు జనరలగు హేస్టింగ్సుగారు తద్విషయమై తగినచర్య సలుపుదు మని వాగ్దానముఁ గావించిరి.

కాని హేస్టింగ్సు యేమియుఁ జేసి వెళ్లఁజాలకపోవుటచే రామమోహనుఁడు నిశ్చింతతో నుండలేకపోయెను. నలువైపులనుండియు వినవచ్చుచుండెడి యసహాయులైన విధవల యార్తనాదములతో నాయన హృదయము కంపించుచుండెను; కన్నీటి ధారలు ప్రవహించుచుండెను; నిద్రాహారములు వెగటయ్యెను; రేయింబగళ్లు విరామములేక ఆయన సహగమనము మాన్పవలయు నని తనసర్వశక్తులను వినియోగించి ప్రయత్నము చేయుచుండెను.

హేస్టింగ్సు తరువాత 'లార్డువిల్లియమ్ బెంటింకు' ఈ దేశమునకు గవర్నరుగా రై వచ్చిరి. ఈగవర్నరుగా రింగ్లాండు దేశమందుండఁగనే రామమోహనుని శక్తియుక్తులను గుఱించియు గుణగణములనుగుఱించియుఁ దఱుచుగాఁ బ్రతికలయందుఁ జదివి యుండెను. రామమోహనుని యింగ్లీషు గ్రంథములను జదివి మిక్కిలి యాశ్చర్య మొందియుండెను. ఆయన యీదేశమునకు వచ్చినతర్వాత రామమోహనునితో స్నేహ మొనర్చుటకును, ఆయనను జూచుటకును గుతూహలపడుచు నొకనాఁ డాయనకొఱకు వర్తమాన మంపిరి.

ఆవర్తమానము తెచ్చినవాఁడు తన్ను సగౌరవముగా నాహ్వానింపలే దని తలంచి మనరామమోహనుఁడు గవర్నరుగారిని

దర్శింపఁబోఁడయ్యెను. అంతట గవర్నరుగారు, రామమోహనుఁడు తనచెంతకుఁ రాకుండుటకు హేతువును గ్రహించినవాఁడై మగల నుచితగౌరవ యుక్తముగా వర్తమానింపఁగా నప్పు డాయన బయలుదేరివెళ్ళెను. చూచితిరా రామమోహానుని యాత్మ గౌరవము !

11/42.

రామమోహనుఁ డీమంచియవకాశమును విడిచిపెట్టక బెంటింక్ బహదూర్‌గారికి సహగమనముయొక్క క్రౌర్యమును, అధార్మికతయు, నత్యాచారము నతివిపులముగ బోధించి తగు ప్రతికారము చేయించుటకై మిక్కిలి ప్రార్థించెను. అప్పుడు బెంటింక్ బహదూర్‌గా రొకచట్టము నేర్పఱచి యాఘోరాత్యాచారదురాచారమును శాశ్వతముగ మాన్పించిరి. రామమోహనుఁ డపుడొక మహాజనసభను సమావేశపఱచి దేశీయులందఱి పక్షముునను గవర్నరుబహదూర్‌గారికి హృదయపూర్వక ధన్యవాదములును, గృతజ్ఞతయును దెలియఁజేసెను. ఈదేశమునం దితిహాస మున్నంతకాలమును రామమోహానుని యీాయక్షయ కీర్తి చిరస్మరణీయమై యుండును.

కేవల మీాసహగమనపిశాచము నంతమొందించుటయే గాక యీాదేశమున నారీమణులను భీడించు "కౌలిన్యప్రథ," పేరిటఁ బురుషులు బహుభార్యలను స్వీకరించుదురాచారమును, బాల్యవివాహములు నొనరించుట మొదలగు ననేకవిధములయిన నిష్ఠురాచారములను హిందూసంఘమునుండి తుడిచి

వేయ నాయన తనయావచ్ఛక్తిని ధారపోసి ప్రియత్నము చేయ మొదలిడెను. ఆయనయొక్క నిరంతరకృషివలనను స్వార్థత్యాగ మువలనను లోకహితాకాంక్షవలనను హిందూసాధ్వీమణులకష్ట ములన్నియు శాశ్వతముగా నంతమొందెను. ధన్యుఁడు రామ మోహనుఁడు! అనేకులు తమజీవితములద్వారా చేయఁజాలని కార్యముల నెన్నిటినో రామమోహనుఁడొక్కఁడే నిర్వర్తింపఁ గలిగెను.

ఇట్లే యాదినములలో నతివిషమపరిస్థితియందున్న కుల మత ద్వేషాహంభావముల నాయన తొలఁగించెను. మఱియు నతఁడు ఏకదైవపితృత్వమును సర్వజనభ్రాతృత్వమును బ్రబో ధించెను. నేఁడు యావద్భారతభూమియందు నాందోళన మొం దుచున్న "అస్పృశ్యతానివారణ సమస్యయు, జాతిభేదనిరసన సమస్యయు" నాఁడే ఆతని ప్రబోధములవలనఁ బునాదులు వేయఁబడిన వని మన మిందుమూలమున గ్రహింపఁగలుగుచు న్నారము.

ముం దెప్పుడో పుట్టఁగల బిడ్డలు సుఖముగా నుందు రను దురభిప్రాయమునఁ దమ తొలిశిశువును గంగాదేవికి బలి గానిచ్చు దురాచార మింకొకటి యాకాలమున మన దేశమంత టను ప్రబలియుండెను. దానినిగూడ నిర్మూలనము గావించి శిశు ప్రాణరక్షకుఁడను విఖ్యాతిఁబడసి యాతఁడు తనజన్మమును ధన్యము గావించుకొనెను.

అనంతరమున రామమోహనుఁడు ఈదేశమునందు విద్యాభివృద్ధిఁ జేయువిషయమై యాలోచింప మొదలిడెను. సహేతుకవిజ్ఞాన యుక్తమగు పాశ్చాత్యవిద్య లేక యీదేశస్థుల కౌన్నత్యము కలుగ దని గ్రహించి దొరతనమువారితో ననవరతము నుత్తరప్రత్యుత్తరములను నడపుచు నాందోళన మొనర్ప నారంభించెను.

మహామతియును భారతబాంధవుఁడునైన డేవిడ్ హేర్ దొరగారు రామమోహనుని కత్యంతసన్నిహితస్నేహితులైయుండిరి. ఆయన యీమహోద్దేశమును నెరవేర్ప రామమోహనునితో నేకీభవించిరి. ఈయిద్దఱు మహాపురుషులప్రయత్నముల చేతను ఈదేశమునందు ఇంగ్లీషు విద్యాభ్యాసమున కనుకూలపరిస్థితు లేర్పడెను.

కాని యప్పటికిని విదేశీయులు రామమోహనునిఁ బూర్తిగా గ్రహింపలేదు; అప్పటికిని ఆయన "విధర్మి" యను దురభిప్రాయముగలవారింకను నెందఱో యుండిరి. అందుచే రామమోహనునియొక్కయు, హేర్ దొరగారియొక్కయు సాహాయ్యమున నీదేశమునందుఁ బ్రథమమున హిందూకాలేజి స్థాపింపఁబడినపుడు, ఆయన తననామ మిందున్నయెడల దేశీయులెవరు నీవిద్యామందిర స్థాపనకార్యమునకు సాహాయ్యముఁ జేయరేమో యని బయటికి మాత్రము రామమోహనుఁడు దానితో సంబంధమును వదలుకొనినట్లుండియు లోలోపల హిందూకాలేజి స్థాప

నకై తనయావచ్ఛక్తిని వినియోగించి విస్తారధనమునుగూడ వ్యయముచేయ మొదలిడెను. ఇట్టి స్వార్థరహితపరహితవ్రత ధారి యగు మహాపురుషులెంద ఱీదేశమున జన్మించిరో లెక్క పెట్టి చూడుఁడు !

ఇదియునుగాక యాయన సంపూర్ణముగాఁ దన స్వంత ఖర్చులతో నింకొక యింగ్లీషుస్కూలును స్థాపించెను. ఎనుబది మందివిద్యార్థు లీస్కూలునందు విద్య నేర్చుకొన నారంభించిరి. అనంతరము డఫ్‌దొరగా రీదేశమునకువచ్చి యొక యింగ్లీషు స్కూలును స్థాపించుటకై రామమోహనుని సహాయమును గోరిరి. రామమోహనుఁడు మనోవాక్కాయకర్మలతో నామ హాకార్యమునకు సాహాయ్యముఁ జేయ మొదలిడెను. తాము ప్రార్థనాదికములు జరుపుకొనుచుండు నద్దెయింటిని స్కూలు కొఱకై విడిచిపెట్టిరి. ఆగృహమందు 'డఫ్' స్కూలు స్థాపింపఁ బడెను. అపు డాయన శారీరికముగాను ఆర్థికముగాను అన్ని విధములయిన సాహాయ్యములను జేసి, యాస్కూలు నున్నత స్థితికిఁ దెచ్చుచుండిరి.

ఈవిధముగా రామమోహనుని సద్గుణములచేతను, ప్రయత్నములచేతను సహాయతచేతను ఈదేశమునం దింగ్లీషు విద్య విపులముగా వ్యాప్తము కారంభించెను.

అదియునుగాక యీదేశమునందు వేదవిద్యాలయము నొకదానిని స్థాపించి విద్యార్థులకు వేదాంతదర్శనశాస్త్రములను

నేర్పుట కేర్పాటులనుగూడఁ జేసెను. ప్రజలు అన్నివిధముల నున్నతవిద్యనొంది యాదర్శమానవులగునట్లుగాఁ జేయ నాయన తనజీవిత మంతయు సమర్పించెను. ఇట్టిమహాపురుషులు ప్రపంచ మున నెందఱో యుందురా? అప్పు డీదేశమునందు పారసీభాష ప్రబలియుండెను. ప్రజలు విద్యావంతులగుటకు నాఁడు పారసీ భాషను నేర్చుకొనుట యావశ్యకము. ఇట్లు తలంచి రామ మోహనుఁడు "అబ్ కరీ" యను నామముతో నొక పారసీ వార్తాపత్రికను బ్రచురింప మొదలిడెను. దానియందు సాహి త్యము, విజ్ఞానము, ఇతిహాసము, భూగోళము, ధర్మతత్త్వము, సమాజతత్త్వము, రాజనీతి మొదలుగాఁగల విషయములను జర్చించుచు వ్రాయమొదలిడెను. ఈవిధముగా నేయే యుపాయ ములచేత దేశీయు లున్నతిఁ జెందఁగలరో యావిషయముల నన్నిటిని రామమోహనుఁ డొక్కఁడే మనదేశముననే చేయఁ గలిగెను.

లార్డుహేస్టింగ్సు వెడలి లార్డు ఆమ్హర్స్టు, ఈదేశము నకు వచ్చుటకు ముందు లార్డుఆడామ్సు కొన్నాళ్ళు గవర్నరు పదవి నధిష్ఠించియుండిరి. ఆవిషయమయి "హరకరా" యను వార్తాపత్రిక మిక్కిలి కఠినవాక్యముల నుపయోగించి యసం తుష్టిని వెలిబుచ్చెను. అందువలన నాపత్రిక నాపివేయ గవర్నరు గారు ఉత్తరవుల నంపిరి. దాని సహాయసంపాదకుఁడు జైలులో నుండవలసి వచ్చునను భయముచేఁ బాఱిపోయి దాఁగుకొనెను.

ముద్రాయంత్రస్వాధీనత లోపించెను. గవర్నరుగారి సభనుండి "గవర్నమెంటువారి యనుమతిలేకుండ నెవ్వరు నేపత్రికను నడుపఁగూడ" దని ఆదేశింపఁబడెను.

దీనివలన దేశవాసులకు మహానర్థము వాటిల్లెననియు, విద్యావ్యాప్తికార్యము నష్టమయ్యెననియు, ముద్రణస్వాతంత్ర్యమును, లేఖనస్వాతంత్ర్యము నడుగంటె ననియు రామమోహనుఁడు గ్రహించెను. ఆయన యీవిషయము నిరోధించుచుఁ బ్రధానవిచారాధిపతికి నివేదన మంపెను. కాని దానివలన నేమియు ఫలముకలుగలేదు. తుదకు ఆంగ్లముఖ్యప్రభువైన జార్జి ప్రభువునొద్దకుఁగూడ దరఖాస్తునంపి బహుప్రయత్నములను జేయుచుండెను.

ఆదినములలో కోర్టునందు నేరస్థులను విచారింప నొక 'జూరీ' యనఁగా పంచాయతి యుండెడిది. ఆంగ్లేయులును, క్రైస్తవులును దప్ప నింక నెవ్వరు నందు సభ్యులుగానుండఁ జాలకపోయిరి. దీనివలన దేశీయులకు మిక్కిలి యిబ్బంది కలిగెడిది. నేరముచేసినవారిని సక్రమముగా విచారింపఁగల హిందూ మునల్మానులు పంచాయతీలో నుండకుండుటయు, సర్వదా క్రైస్తవులే యుండుటయు రామమోహనునకుఁ దప్పుగాఁ దోఁచెను.

విచారణ సరిగనుండక దేశీయులు విపద్గ్రస్తులును, భయకంపితులు నగుచుండెడివారు. అందుచే దేశీయుల మనస్సు

లందు చట్టములపైని కోర్టులపైని ఒకవిధమగు నవిశ్వాస మును, దొరలపై నశ్రద్ధయుఁ గలుగు సూచన లారంభమా యెను. రామమోహనుఁడు ఈవిషయమును లండనుమంత్రి సభకును పార్లమెంటువారికిని దరఖాస్తులద్వారా తెలిపి యాం దోళనముచేయ మొదలిడెను. తత్ఫలితముగాఁ దుదకు ఈ దేశ విచారణాలయములలోఁ దగిన దేశీయులు, జూరీలుగా నధికారము పొందిరి.

ఇదిగాక నిరుపేదలగు రైతులకయి గవర్నమెంటు వారిని మిక్కిలి ప్రాధేయపడి, విజ్ఞప్తులొనర్చియు, నుత్తరప్రత్యుత్తరము లను నడపియు, రామమోహనుఁడు వారీయవలసిన పన్నుల విషయములో ననేక విధములగు నదుపాయములను గల్పించెను.

ఆయనవంటి ప్రజాబాంధవుఁడును దేశబాంధవుఁడును, లోకహితవ్రతపరాయణుఁడును ఉదారస్వభావుఁడును నగు మహాపురుషుఁ డెచ్చటఁ గలఁడు?

మఱియు రామమోహనుఁడు మిగుల దేశప్రజాస్వాతంత్ర్య ప్రియుఁడు. ఒకప్పుడు ఐరోపాఖండమందలి 'ఫ్రాన్సు' అను నొక దేశమందుఁ బ్రభుపరిపాలన స్థానమునఁ బ్రజాపరిపాలనమును బ్రజాస్వాతంత్ర్యమును బ్రాప్తించెనని విని, యానాఁడు సంతోష పరవశుఁడై తన మిత్రవర్గమును బిలిచి యొకగొప్ప విందొన ర్చెను. అచ్చటనే వేఱొకసారి ఇటలీరాజ్యమున నేపిల్సుపట్టణ ప్రజలు తమప్రభువువలనఁ గొన్ని స్వాతంత్ర్యములను బొందిన

వారై వెనువెంటనే సేనలయొత్తిడి నొంది తమ స్వాతంత్ర్యమునుగోల్పోయిరని యాయన వినుట తటస్థమయ్యెను.ఆనాఁడతఁడొకముఖ్యకార్యమునుగూర్చి యొకయూరపియను స్నేహితుని జూడఁ బోవలసి యుండెను. కాని యానాఁటి వార్తాపత్రికలు దనకుఁ దెచ్చిన నేపిల్స్‌ప్రజల స్వాతంత్ర్యపరాజయమను దుఃఖవార్త వింటిననియు నందుచేఁ దన మనస్సు శాంతిఁదప్పియున్నదనియుఁ దానాదిన మాదొరగారిని దర్శింపఁజాలననియు జాబువ్రాసి పంపెను.

మఱియొకసారి తాను ఇంగ్లండునకుఁ బయనమైపోవుచు నాఫ్రికాఖండతీరమున నొకరేవుపట్టణమందు రెండు యుద్ధనౌకలను జూచెను. వానియొక్క ధ్వజస్థంభములపై ఫ్రాన్స్‌దేశపు ప్రజాస్వాతంత్ర్య పతాకములు ముత్తెఱంగుల నలరారుచుండ నెవరోచూచి యాతనిచెవిని వేసిరి. తా నది విని యానందమును బట్టఁజాలక కన్నులార తానాపతాకములను జూచుకొనుటకు—తా నపుడు కాలుజాఱి పడి నడవలేని దుస్థితిలో నుండినప్పటికిని—తన డాక్టరు తన్ను కదలరాదని వేడుకొని నప్పటికిని వినక—తనవారిని తొందరచేసి వారిచేఁ జేతులపై నెత్తుకొని పోఁబడి తన తనివితీరఁ గన్నులపండువుగా నాప్రజాస్వాతంత్ర్యమహాభాగ్యదృశ్యమును గాంచి యానందించెను. చూచితిరా అతనియొక్క ప్రజాస్వాతంత్ర్యాభిలాష!

## అష్టమప్రకరణము.

———o———

అటుతరువాత రామమోహనుఁ డేకార్యమునందు నిమగ్నమనస్కుఁ డై యుండెనో యాకార్య మాదినములలో నీదేశీయుల కెంత దురవగాహముగాను, భయానకముగాను, అస్వాభావికముగాను నుండెనో యది లోకుల ధారణకల్పనల కతీతమై యున్న దన్నను నత్యుక్తి గాదు.

సకలదేశములలోను సకలవిషయములందును బ్రిటిషు నివాసప్రదేశము ప్రధానమైనట్టియు, సర్వశ్రేష్ఠ మయినట్టియు స్థానము. కావున నట్టి ప్రధానస్థానమగు నింగ్లండునకు వెళ్ళి యభిజ్ఞత సంపాదింపకున్నచో మనుజుని జ్ఞానమును, విద్యయు, పాండిత్యమును అన్నియు నసంపూర్ణముగా నుండుననియు, దేశమునకుఁగాని ప్రజలకుఁగాని యున్నతిని గలుగఁజేయు నట్టి మహాకార్యమును జక్కఁగా నెరవేర్ప వీలుగాదనియు నాయన గ్రహించెను. విశేషముగా నొకదేశముయొక్కయు, జాతియొక్కయు, సంఘముయొక్కయు నున్నతికై, మంగళమునకై యాత్మత్యాగమొనరించి దేశసేవాపవిత్రవ్రతమును స్వీకరించి పనిచేయువారు తమప్రధానరాజస్థానమునకు వెడలి, రాజపరిచితియు, సానుభూతియు గడించుట మిక్కిలి యావశ్యకము లేగదా! అందుచే దేశముయొక్కయు, జాతియొక్కయు, సంఘముయొక్కయుఁ గళ్యాణార్థమై యాత్మార్పణమునొనర్చు మహాత్ముఁడగు రామమోహ

నుఁడు భారతరాజధానియగు నింగ్లండునకు వెడల నుద్యుక్తుఁ
డయ్యెను.

కాని యంతవఱకు నీదేశవాసు లెవరును సముద్రమును దాఁటి యుండలేదు. అవిజ్ఞాత దేశమునకుఁ జనియుండలేదు. కావున మనదేశస్థు లప్పటికాలమునం దింగ్లాండు వెళ్ళుటయన నిప్పటివారి కెంతయాశ్చర్యకరమైన విషయముగాఁ దోఁచునో వేఱుగఁ జెప్పనవసరము లేదుగదా.

ఇంగ్లాండుదేశమునకు వెళ్ళుటయన నప్పటివారి కొక స్వప్నరాజ్యమునకుఁ బోవుటయే. పరదేశముఖ మెఱుఁగని దేశీయుల మనస్సులలో ఆదూరదేశస్థప్రశస్త ప్రభుస్థానమందలి శిల్ప వాణిజ్యములును శిక్షాదక్షతయు నాచారవ్యవహారములును, ధన సంపదలును, శోభాసౌందర్యములు నన్నియు నొక గౌరవమయ మగు నజ్ఞాతసౌందర్యముతో శోభిలు చున్నటుల దోఁచెడివి. అప్పటివఱకు నీదేశవాసు లెవరును దామూహించిన యాదూర సముద్రపారమునఁగల యాసువర్ణస్వప్నరాజ్యమునకు జాతిమత ప్రతిబంధములవలనను ధనాభావమువలనను వెళ్లసాహసింపరైరి.

రామమోహనుఁడే మొట్టమొదట నాయాంగ్లమహాసామ్రాజ్య ముఖ్యస్థానమునకు వెళ్ళ నుత్సహించిన వాఁడయ్యెను.

ఇంగ్లాండు ఆంగ్లప్రభువుల జన్మస్థానము. అచ్చట మన ఆంగ్లేయసార్వభౌముఁడు నివసించుచుండును. ఈదేశపు శాసన కర్త లాదేశమునందుండి యిచ్చటి కార్యములను శాసించుచుఁ

బాలించుచుందురు. ఈదేశీయుల సుఖదుఃఖములును, ఔన్నత్య వసతులును, శుభాశుభములు నన్నియు వారిహస్తగతములై యుండును. కాని యీదేశపు పరిస్థితులను వారు స్వయముగా గమనింప వీలులేకుండెను. అచ్చటికి వెళ్ళఁగలిగి స్వయముగా వారితోఁ బరిచయము సంపాదించి యీదరిద్రభారతదేశము యొక్క దుఃఖచరిత్రవివరముగాఁ దెలుపఁగలిగినయెడల నిజముగా నీదేశమున కెంతేని మేలు చేకూరఁగలదని రామమోహనుఁడు తలంచెను. దేశదుఃఖపీడితహృదయుఁడును, పరహితార్థాత్మ త్యాగియు నైన రామమోహనుఁ డాకారణముచే నింగ్లాండు నకుఁ బోవలయు నని తలఁచి మంచిసమయమును వెదకుచుండెను.

ఎవ రెట్లు తీవ్రసాధన నిష్ఠు లగుదురో వా రట్లే కార్య సిద్ధిని బొందుదురు. ఎవ రేకాంతానన్యచిత్తముతో దేనిని గోరు దురో పరమదయాస్వరూపుఁడై న భగవానుఁడు వారలకు దానిని బ్రసాదించుచుండును. కావుననే రామమోహనున కింగ్లాండు వెడలుటకు మంచియవకాశము దొరకెను.

ఆసమయమున ఢిల్లీపాదుషాకును, ఈస్టిండియా కంపెనీకిని గొన్నివిషయములలో భేదభావములు తటస్థమాయెను. ఆవిషయముల నన్నిటిని మంత్రిసభలలో సముచితముగాఁ దెలి యఁజేసి దానికిఁ దగిన మీమాంసను జేయించుటకు పాదుషా గారు తగినవారికొఱకై వెదకుచుండిరి. అపుడు రామమోహను నివంటి సర్వవిద్యావిశారదుఁడును, సర్వవిషయములలోను సర్వ

విధముల యోగ్యతగలవ్యక్తియు నీదేశమునం దింకేవరును లేకుండిరి. కావుననే పాదుషా రామమోహనరాయుని దనరాజ కార్యమునుగూర్చి విదేశమునకుఁ బంప నిచ్ఛగించెను. రామ మోహనుఁడుగూడ పాదుషాయొక్క ఆదేశమును శిరసావహిం చెను.

పాదుషా అప్పు డత్యంతసంతుష్టుఁడై రామమోహాను నకు "రాజా" యను బిరుదమునొసంగి యాయనకు వలయు సకల సదుపాయముల నేర్పాటు చేయించి యింగ్లండునకుఁ బం పెను. 1830 వ సంవత్సరము నవంబరు 19 వ తేదీని రామ మోహనుఁడు 'ఆరెబియన్' స్టీమరులో మొట్టమొదట నింగ్లాం డునకుఁ బయనమయ్యెను.

ఇంతకుఁ బూర్వమే యింగ్లాండు దేశీయులు రామమో హనుని గుఱించి వినియుండిరి. మఱియు నాతని గుణగణములను గుఱించియు, శక్తిసామర్థ్యములను గుఱించియు విని యాయన వైపున కాకర్షింపఁబడి యుండిరి. రాజా రామమోహనుఁ డింగ్లాండుచేరినవెంటనే పలువురు దొరలును దొరసానులు నాయ నకు స్వాగతమియ్యవచ్చిరి. ప్రతివారును దమతమయిండ్లయం దాతిథ్యము స్వీకరింపవలయునని రామమోహనుని బలవంతపెట్ట సాగిరి. కాని స్వాతంత్ర్యప్రియుఁడగు రామమోహనుఁడు వారి కందఱికిని వందనము లర్పించి యొకహోటలునం దావాస మేర్ప ఱచుకొనెను.

అప్పటినుండియు నాదేశపు పండితవరేణ్యు లనేకు లాయ నతోఁ బరిచయము చేసికొని యానందించుచుండిరి. అనేకగణ్యా మాన్యు లాయనతో స్నేహమేర్పఱచుకొని తమ్ము ధన్యులుగా భావించుకొనిరి. చూచుచుండఁగనే రాజా రామమోహానుని యశస్సు నలుగడల వ్యాపింపఁజొచ్చెను.

ఆసమయమం దింగ్లాండులో మంత్రిసభయందు రిఫారమ్ బిల్లు (సంస్కరణశాసనము)నుగుఱించిన యాందోళన మారంభ మయ్యెను. రామమోహానుఁ డామహాసభయం దావిషయమై యింగ్లీషునం దతిప్రశస్తములగు యుక్తులతో నుపన్యాసము నొసంగెను. అచ్చటివా రందఱు నది విని నిశ్చేష్టులై యాయన ప్రతిభను వేనోళ్ళఁ బొగడఁజొచ్చిరి. అనంతరమున రామమోహనుని యాందోళనమును గుఱించిన యాలోచనలును, మంత్రిసభయందు బహుతర్కవితర్కములును, వాదోపవాదములును జరిగినపిమ్మట 'సంస్కారశాసనము' అంగీకృత మాయెను. దీని వలన మనదేశపు వ్యవసాయదారుల కష్టము లనేకములు తొలఁగిపోయెను. అట్లు కాకున్నపక్షమునఁ దా నింకముందు ఇంగ్లీషురాజ్యమునం దుండ నని యాయనప్రతిజ్ఞ చేసెను. రామమోహానుఁ డాచట్టము విజయ మొందినందున పిమ్మటఁ దన్నుధన్యునిగాఁ దలంచుకొనెను.

కేవల మాకార్యమును ముగించినంతమాత్రమునసే రామమోహానుఁడు సంతుష్టిఁ జెందియుండలేదు. ఈదేశప్రజలపై

నెక్కువపన్నులువేయకుండఁగను,సాధారణప్రజలుజమీందారుల యత్యాచారములనుండి రక్షింపఁబడుటకును, ఈదేశీయు లున్న తవైద్యవిద్యను బొంది గొప్పగొప్ప డాక్టరు లగుటకును, గొప్ప జీతములను బొందు రాజకార్యములలో నియుక్తు లగుటకును, దగినట్లు ఆవిషయములను గుఱించి ప్రయత్నములు చేయమొదలిడెను. ఆయన దయచేతను, శక్తిచేతను, యత్నములచేతను భారతీయు లీసమయమున సకలాధికారములను సకల సదుపాయములను బొందఁగలుగుచుండిరి.

ఇట్టి ధర్మనీతిజ్ఞుఁడు, రాజనీతిజ్ఞుఁడు, పరమపండితుఁడునైన రామమోహనుని యశస్సును, పేరుప్రతిష్ఠలును ఐరోపాఖండమందలి యన్నితావులయందును బ్రచారితము లయ్యెను. అపుడు సార్వభౌముఁడు స్వయముగా మంత్రిసభనుండి లేచి ఆయనకు పాదుషా యిచ్చిన "రాజా" బిరుదమును తామిచ్చిన బిరుదుగా నెంచుకొనుమని చెప్పిరి. అది మొదలుగా రామమోహనుఁ డింగ్లాండులోఁ బ్రతిగృహమందును రాజార్హమైన గౌరవము నొంద నారంభించెను. సార్వభౌమునిపట్టాభిషేకకాలమందుఁగూడ అభిషేకసమీపస్థలమందుఁ గూర్చుండుటకు మహాగౌరవప్రదముగు నున్నతాసనమును బడసిరి.

ఇంగ్లాండునుండి యాయన ఫ్రాన్సుదేశమును జూచి వచ్చుటకుఁ బయనమాయెను. ఆయనకుఁ బరమస్నేహితులైన డేవిడ్ హేర్ దొరగారి తమ్ముఁ డాయనకు సహచరులై వెళ్ళిరి.

అచ్చటి ఆకాలపు ఫ్రెంచిసార్వభౌముఁడగు ‘ లుయీఫిలిఫ్ ’ ప్రభువు స్వయముగా నాయన నాదరించి తన సహపంక్తిని గూర్చుండఁబెట్టుకొని యాయనతో భుజించిరి. ఇట్టి మహా సన్మాన మింతవఱకు భారతీయుల కెవ్వరికిని జరిగియుండలేదు.

అచ్చట ఫ్రెంచిమహాకవియగు ‘ టామస్‌మూర్ ’ తో నాయనకు మిక్కిలి స్నేహము కలిగెను. ఆకవివరుఁడు తన‘ డైరీ’ లో రామమోహనుని పాండిత్యవిశేషమునుగూర్చియు, సుగుణ సామర్థ్యప్రతిభాదులను గుఱించియు విశేషముగ వర్ణించుచు వ్రాసికొనెను.

అచ్చటినుండి రామమోహనుఁడు తిరిగి ఇంగ్లాండునకు వెళ్ళి హేర్ దొరగారి యింటియందు నివసించుచుండెను.

మనుజుఁడు జన్మతః పాపిగా జన్మించుచున్నాఁడని యచ్చటి క్రైస్తవ ధర్మసంఘమునం దొకవిరుద్ధాభిప్రాయము నిరూఢమై యుండెను. రామమోహనుఁడు తన యద్భుత ప్రతిభా బలముచే విదేశీయ ధర్మసమాజమునం దున్నయీయభిప్రాయ మును ఖండించివైచెను. అందుచే మిక్కిలి పేరుపొందిన పాదిరీ లనేకు లాయునయం దనురాగముగలవారైరి. వారిలో రెవరెండ్ డేవిడ్‌సన్‌తో మన రాజాకు మిక్కిలి స్నేహము కలిగెను. పాదిరీ గారు రామమోహనుని మిక్కిలి భక్తిశ్రద్ధలతోడను బ్రేమ తోడను జూచుచుండిరి. తనపుత్త్రుని నామకరణోత్సవ సందర్భ మున రామమోహను నాహ్వానించుటయేగాక అందఱియెదుట

పుత్రునికి 'రామమోహానుఁ' డని నామకరణ మొనర్చెను. ఇది యొకజాతి కెంతశ్లాఘాపాత్రమైనగౌరవమైనదో చూడుఁడు! ఈవిషయమై దూరదేశమందు రామమోహానునిచే స్వజాతి గౌరవ మెంతయుజ్జ్వలితము గావింపఁబడెనో యాలోచించి ప్రతి భారతీయుఁడు నాయనయెడలఁ జిరకృతజ్ఞుఁడై యుండుట యావశ్యకమేగదా!

ఇట్టి నానాకారణములచేత ఇంగ్లాండునందుండు కాల మున ననేక సద్వంశధనికులతో రామమోహానునకుఁ గ్రిమముగా బంధుత్వ మేర్పడెను. బ్రిస్టల్ 'క్యాసల్' వంశమువారితోఁ గూడ నాయనకు బంధుత్వ మేర్పడెను. 'క్యాసల్' గొప్ప ధనికుఁడును, వర్తకుఁడునై యుండెను. ఆయన తన విపులధన మును, ప్రాసాదములును, ఒక కుమార్తెను విడనాడి పరలోకగతులైరి. కుమారి క్యాసల్ యొక్కయు, డాక్టర్ కా ర్పెంటర్ యొక్కయు కోరికపై కొన్నాళ్ళు విశ్రమించుటకై రామమోహానుఁడు బ్రిస్టలునందు కుమారి క్యాసల్ గృహ మందు వసించుచుండిరి.

'బ్రిస్టల్' లండనునొద్ద మనోహర మగుపల్లెగ్రామము అచ్చటి ప్రాకృతిక దృశ్య మతిసుందరమైనది. రామమోహానుఁ డచ్చటికి వెళ్ళుటచే నవజీవితమును బొందినటు లయ్యెను. అచ్చ టఁగూడ నాయన కనేకమంది స్నేహితులు దొరకిరి. అందఱిని ఛాయలవారు తమ యమాయికాదరణతోఁ దృప్తిపఱచిరి.

అచ్చటి పల్లెటూరి దరిద్ర కృషీవలులుగూడ నాయన స్నేహా మును బొంది ధన్యులైరి. రామమోహనులు ప్రతిబీదవానికుటీరమునకును వెళ్ళి వారల నానందపఱచుచుండిరి.

అచ్చటనే కార్పెంటర్ యొక్క కుమారియగు మేరీకార్పెంటర్ కన్యతో రామమోహనునికిఁ బరిచయము కలిగెను. ఆయనయే యామె హృదయమునందు లోకహితాచరణవ్రతమునుగుఱించిన సదభిప్రాయములను మొలకలెత్తించెను. తత్ఫలితము ననుభవించి భారతదేశవాసు లొకప్పుడు ధన్యులైరి.

అచ్చటఁగూడ రామమోహనుని నామము ఖ్యాతిప్రచారిత మగుచుండెను. ఆయన యుపన్యాసమును వినుటకై యొక దినమున నొక మహాసభ యేర్పాటుచేయఁబడెను. ఆసభకు ఆదేశమునందున్న పిన్న పెద్దలును, ధనిక దరిద్రులును, స్త్రీపురుషులును బాలవృద్ధులును సమావేశమై రామమోహనుని యుపన్యాసమును వినిరి; అందఱునుముగ్ధులై "ధన్యులము! ధన్యులము!" అని పలుకుటయేగాక రామమోహనుని పుణ్యమూర్తిని వారి హృదయములలో శాశ్వతముగా నంకిత మొనర్చుకొని తమతమ గృహముల కేగిరి.

రామమోహనుని జీవితమునం దిదియే కట్టకడపటిసభ. ఈయుపన్యాసమే యతని యంత్యోపన్యాసము. ఆమఱునాటి నుండియే యాయన జ్వరాక్రాంతుఁ డయ్యెను. క్రమముగా

నా జ్వర మెక్కువయ్యె ప్రమాదావస్థకుఁ దెచ్చెను. తుదకు జీవన సంకట మేర్పడెను.

కుమారి క్యాసెల్, కుమారి కార్పెంటర్, కుమారి హేర్ మొదలగు నారీమణులెల్లరును, తల్లులవంటి స్నేహముతో, కన్యలవంటి యాదరముతో అహోరాత్రము లెడ తెగని శ్రమతో రామమోహనుని సేవచేయ నారంభించిరి. బహువ్యయప్రయాసల కోర్చి గొప్పగొప్ప డాక్టర్లను దెప్పించిరి. అమూల్యములగు నౌషధముల కేర్పాటుచేసిరి. వైద్యమున కేమాత్రము లోటు లేకుండెను.

కాని ఫలిత మేమియు లేకపోయెను. సెప్టెంబర్ 27 వ తేది రాత్రి యొకటిన్నరగంటల కాయనయందు మృత్యులక్షణములు గోచరమయ్యెను. రాత్రి 2_25 నిమిషములకు ఆమహాపురుషుని నేత్రములు శాశ్వతముగా నిమీలితములాయెను. అంతట నావిదేశబంధువు లాబాలవృద్ధముగా నాయనమరణముచేఁ బితృశోక సమానదుఃఖము ననుభవించిరి. అచ్చట నొక సుందరోద్యానమందు ఆయనను పరమశ్రద్ధాభక్తులతో సమారోహముతో సమాధి గావించిరి.

అనంతరము స్వర్గీయ ద్వారకానాథ ఠాకూరు, ఇంగ్లాండునకు వెళ్ళినపుడు రామమోహనుని పుణ్యదేహము నచ్చటి నుండి దీయించి "నన్ వెల్" అను చోటికిఁ దెచ్చి సమాధి చేయించి దానిపై నొక సుందరమందిరమును నిర్మించెను.

చేతిలో నుండఁగనే రత్నమును గ్రహింపము; దగ్గఱను న్నను దైవమును బూజింపము. చిరకాల మనుతప్తహృదయ ములతో ఆయన స్మృతిదీపమును మన మనములలో వెలిఁగించి యుంచి ధన్యుల మయ్యెదముగాక !

## 1 శ్రీరామమోహనుని పావనజీవితకార్యక్రమసంగ్రహము.
(సంవత్సరక్రమముగా)

1772 మే 22 రాధానగరమందు జన్మించుట (వంగ సం॥ 1179 జ్యేష్ఠమాసము)

1781 } 1782 } చిన్ననాఁడె వివాహితుఁ డయ్యెను. ప్రథమకళత్రవియోగము తటస్థపడఁగాఁ దండ్రి మరల రెండు వివాహములు చేసెను. ఇది కులీన సాంప్రదాయమఁట. విద్యాభ్యాసము.

1787 విద్యాపూర్తి. తల్లిదండ్రులతో భేదభావము. స్వగ్రామమును విడుచుట.

1788 } 1789 } త్రివిష్టప (టిబెట్టు) దేశనివాసము; పాలీ, తురానియన్ భాషల యభ్యాసము. బౌద్ధదురాచారఖండన, లామాలతో విరోధము. అచ్చట స్త్రీల సహాయము.

1790 } 1791 } స్వదేశ ప్రవేశము. తల్లిదండ్రులకును తనకును సరిపడకుండుట. కాశీనివాసము.

1800 ప్రథమపుత్రజననము.

1801 డిగ్బీ దొరగారి పరిచయము.

1803 రామమోహనునితండ్రిరమాకాంతరాయలమరణము.

1804 to 1813 } ఉద్యోగము.

1814 కలకత్తా నివాసము; ఉద్యోగముమానుట.

1815 ఆత్మీయసభానిర్మాణము; "వేదాంతములను" వంగ భాషలోనికి మార్చుట.

1816 ఉపనిషత్తుల భాషాంతరీకరణము.

1817 డిగ్బిదొరగారికి లేఖవ్రాయుట, మఱికొన్ని ఉపనిషత్తుల భాషాంతరీకరించుట.

1818 సహగమనవిషయిక ప్రథమవ్యాసము.

1819 సుబ్రహ్మణ్యశాస్త్రితోఁ జర్చ.

1820 ఫిబ్రవరి 26 } సహగమనవిషయిక ద్వితీయ వ్యాసరచన. జీసను బోధసారప్రచురణము. క్రైస్తవులతోఁ బ్రథమ వాదము.

1821 ద్వితీయవాదము; విన్నపము. క్రైస్తవాచార్యులైన 'ఆదము' గారు బ్రాహ్మసమాజాదర్శముల నంగీకరించుట.

1821 డిశెంబరు 4 } సంవాదకౌముదీ ప్రచురణము.

1822 మిరాత్ అల్ అక్బరను వారపత్రికా స్థాపనము.

1823 మాససభలు—క్రైస్తవులతోఁ దృతీయవాదము. పత్రికా నిర్వహణవిషయమై దొరతనమువారికి విన్నవించుట. గ్రంథరచన.

1824 హేరుదొరతో నుత్తరప్రత్యుత్తరములు. దక్షిణ ఇండియాలోని కరువును గూర్చిన విన్నపములు.

1825 వివిధములగు దైవారాధనల విషయమై వ్రాయుట.

1826 మొదటి బెంగాలీ వ్యాకరణరచన, వేదాంతకాలేజీస్థాపనము

1827 గాయత్రీద్వారా ఉపాసనలు.

1828 ఆగస్టు 20 } పంచాయతీలద్వారా దోషవిచారణ (Juri Bill) బ్రహ్మసమాజ స్థాపనము—ప్రథమసమావేశము.

1829 1830 నవంబరు } నీలిమందు తోఁటలలోని కూలీల క్షేమమును గూర్చి రామమోహనుఁడు కలుగఁజేసికొనుట— సహగమన దురాచారభంజకములగు వ్రాఁతలు, ధర్మసభలు మొ॥ ఆదిబ్రహ్మ సమాజనిర్మితి మున్నగునవి.

1831 1832 1833 సెప్టెంబరు 27 } ఇంగ్లాండు నివాసము, ప్యారిసునగర దర్శనము, తిరిగి ఇంగ్లాండు ప్రవేశము, సహగమనము రద్దుపఱచుట, జబ్బు, మరణము, సంపూర్ణము.

# మా వద్ద దొరకు పుస్తకములు.

1 రాజర్షి రామమోహనరాయల చరిత్రము వెల 0—10—

2 మహర్షి దేవేంద్రనాథఠాకూరుగారి చరిత్రము 0—1[illegible]—

3 జ్ఞానదీపిక (సాధనబిందు) పండిత సీతానాథతత్త్వభూషణు
వారి బంగాళీగ్రంథమునకు అనువాదము. 0—8—
అనువాదకుడు—ఆకురాతి శ్రీకృష్ణమూర్తిగారు.

4 శాంతినికేతనము (ధర్మోపదేశములు.)
కవిసార్వభౌముడు శ్రీరవీంద్రనాథఠాకూరుగారిది.
అనువాదకుడు—ఆకురాతి శ్రీకృష్ణమూర్తిగారు.

5 భక్తవరేణ్యుడు పిళ్ళారిశెట్టి సీతారామయ్యగారి
జీవితచరిత్రము 0—[illegible]—

6 శాంతికుటీరము రిపోర్టు 0-2-0లుబిళ్ళలు పంపువారి కుచితము
(చాలా బొమ్మలతోనున్నది.)

ఆకురాతి చలమయ్య,
సూపరింటెండెంటు, శాంతికుటీరము
పిఠాపురము
తూర్పుగోదావరిజిల్లా.